కాకతీయ విశ్వవిద్యాలయం బి.ఏ; బి.యస్‌సి; బి.కాం. మొదటి భాగం
(రెండవ సంవత్సరం) తెలుగు పాఠ్యపుస్తకం

---

# ఆధునిక పద్యమంజరి




తెలుగు విభాగము
విద్యారణ్యపురి

కాకతీయ విశ్వవిద్యాలయము
వరంగల్లు

కాకతీయ విశ్వవిద్యాలయం బి.ఏ; బి.యస్‌సి; బి.కాం. మొదటి భాగం
(రెండవ సంవత్సరం) తెలుగు పాఠ్యపుస్తకం

# ఆధునిక పద్యమంజరి



తెలుగు విభాగము
విద్యారణ్యపురి

కాకతీయ విశ్వవిద్యాలయము
వరంగల్లు

# ADHUNIKA PADYA MANJARI

*Selections from Telugu Modern Poetry under Part I for*

**B.A., B.Sc., B.Com. Second Year**

1983-84, 1984-85, 1985-86 Academic Years

*General Editor:*

**Dr. K. V. Ramakoti Sastry**

Prof. & Head, Dept. of Telugu

*Editors :*

**G.V.L.N. Vidya Sagara Sarma;** Dept. of Telugu
Govt. Pingle College, Wgl.

**I. Kishan Rao;** Dept. of Telugu
Lal Bahadur College, Wgl.



Copies: 3,000

**PRICE: THREE RUPEES**

*Copies can be had from :*

**The Registrar, Kakatiya University, Warangal**

*Printed at :*

**Ashoka Printers, (Beside Radhika Thetare) Warangal-2**

# విషయ సూచిక

# సంపాదకీయం

కాకతీయ విశ్వవిద్యాలయం సర్వకళాశాలల తెలుగు అధ్యాపకుల ప్రథమ మహాసభ 30-4-1977 న తీసుకొన్న నిర్ణయం ప్రకారం బి.ఏ; బి.ఎస్సీ; బి.కాం. తరగతుల మొదటి భాగం తెలుగు పాఠ్య పుస్తకాలను విశ్వ విద్యాలయం విధానంగా ఆమోదించింది. ఆ క్రమంలో 1977 లో రత్నాపణం, 1979 లో ముక్తావళి, 80 లో రత్నావళి పుస్తకాలు ప్రచురింపబడ్డాయి. ఈ 82-83 లో ప్రాచీన పద్యమంజరి ఆధునిక పద్యమంజరి గద్యమంజరి అనే మూడు పుస్తకాలను ప్రచురిస్తున్నాము.

కాకతీయ విశ్వవిద్యాలయం ఏర్పడ్డప్పటి నుండి కూడా డిగ్రీ తరగతుల తెలుగు పాఠ్య గ్రంథాలను నిర్ణయించటంలో కళాశాలల్లో పని చేసే తెలుగు అధ్యాపకుల పాత్ర ప్రధానంగా ఉంది. వారు సూచించిన కవులనూ రచయితలనూ గ్రంథాలను గ్రంథభాగాలనూ, వ్యష్టిగానూ సమష్టిగానూ చర్చలలో పెట్టి కుదింపులూ మదింపులూ జరిగిన తరువాత వరుస క్రమంలో వాటిని పాఠ్య గ్రంథ నిర్ణాయక సంఘం వారి ముందు ఉంచటం జరుగుతుంది. డిగ్రీ విద్యార్థుల స్థాయి దృష్ట్యా ఉచితంగా ఉన్నవాటి ఉత్తమత్వాన్ని బట్టి నిర్ణాయక సంఘంవారు సిఫారసు చేస్తారు. అలా సిఫారస్ చేయబడినవే మన తెలుగు పాఠ్య గ్రంథాలు.

ఈ ఆధునిక పద్యమంజరి డిగ్రీ రెండవ సం॥ తరగతులకు సిద్ధం చేయబడింది. దీని సంపాదకులు శ్రీ జి.వి.యల్.యన్. విద్యసాగర శర్మ శ్రీ ఐ. కిషన్‌రావు గారలు. పాఠ్య గ్రంథ నిర్ణాయక సంఘం వారి ఆదేశాలకనుగుణంగా వీరు ఈ ఆధునిక పద్యమంజరిని సమకూర్చారు. ఇందులో గురజాడ నుండి దాశరథి వరకు మొత్తము 9 మంది కవుల కావ్యాల నుండి పాఠ్యాంశాలను ఎన్నిక చేయటంతోబాటు ఆయా కవులను గురించి ఆయా పాఠాలను గురించి పరిచయాలు వ్రాస్తూ అవసరమైన అర్థ వివరణలను కూడ సంగ్రహంగా సమకూర్చారు. సంపాదకులు చేసిన ఈ పని అటు అధ్యాపకులకు ఇటు విద్యార్థులకు కొంత సహాయ కారిగానూ మార్గదర్శకంగానూ ఉండగలదు. ఇందుకు మరింత దోహద కారిగా తమ అధ్యాపక విధానాన్ని మలుచుకోవటం వల్ల విద్యార్థులకు ఎక్కువ తోడ్పడినవారౌతారు.

సకాలంలో విద్యార్థులకు ఈ పుస్తకం అందుబాటులోకి రావటానికి కృషిచేసిన సంపాదకులను విశ్వవిద్యాలయం తెలుగు విభాగం పక్షాన అభినందిస్తున్నాను.

సంపాదకత్వంవేరు, ప్రెస్సు పనివేరు. దీనికి మరింత ఓర్పు నేర్పు కావాలి. ఈ విషయంలో అంత బాధ్యతను నెత్తిన వేసుకొన్న శ్రీ ఐ. కిషన్‌రావు గారు అభినందనీయులు.

డా॥ కేతవరపు రామకోటిశాస్త్రి

గురజాడ అప్పారావు

# పూర్ణమ్మ

మేలిమి బంగరు మెలతల్లారా!
కలువల కన్నుల కన్నెల్లారా!
తల్లులగన్నా పిల్లల్లారా!
విన్నా రమ్మా యీ కథను.

ఆటల పాటల పేటికలారా!
కమ్మని మాటల కొమ్మల్లారా!
అమ్మల గన్నా అమ్మల్లారా!
వినరమ్మా మీరీకథను.

కొండల నడుమను కో నొక టున్నది;
కోనకి నడుమా కొల నొక టుంది;
కొలని గట్టునా కోవెల లోపల;
వెలసెను బంగరు దుర్గమ్మ.

పూజా రింటను పుట్టెను చిన్నది
పుత్తడి బొమ్మా పూర్ణమ్మా;
అన్నల తమ్ముల కనుగై దుర్గకు
పూజకు పువ్వులు కోసేది.

ఏ యే వేళల పూసే పువ్వుల
ఆ యా వేళల అందించి
బంగరు దుర్గను భక్తితొ కొలిచెను
పుత్తడి బొమ్మా పూర్ణమ్మ.

ఏ యే ఋతువుల పండే పళ్ళను
ఆ యా ఋతువుల అందించి
బంగరు దుర్గను భక్తితొ కొలిచెను
పుత్తడి బొమ్మా పూర్ణమ్మ.

పళ్ళను మీరిన తీపుల నడలును
పువ్వుల మీరిన పోడుములున్
అంగము లందున అమరెను పూర్ణకు
సౌరులు మించెను నానాటన్.

కాసుకు లోనై తల్లీ తండ్రీ
నెనరూ న్యాయం విడనాడి
పుత్తడి బొమ్మను పూర్ణమ్మను వొక
ముదుసలి మొగడుకు ముడి వేస్రీ.

ఆమని రాగా దుర్గ కొలనులో
కలకల నవ్వేను తామరలు
ఆమని రాగా దుర్గవనములో
కిల కిల పలికెను కీరములు.

ముద్దు నగవులూ ముచిపంబు మరి
పెనిమిటి గాంచిన నిమిషమున
బొసెను కన్నియ ముఖ కమలమ్మును
కన్నుల గ్రమ్మెను కన్నీరు.

ఆటలపాటల తోటి కన్నియలు
మొగుడు తాత యని కేలించ,
ఆటల పాటల కలియక పూర్ణమ
దుర్గను చేరీ దుఃఖించె.

కొన్నాళ్ళకు పతి కొని పోవచ్చెను
పుత్తడి బొమ్మను పూర్ణమను;

చీరెలు సొమ్ములు చాలగ దెచ్చెను
పుత్తడి బొమ్మకు పూర్ణమకు.

పసుపు రాసిరి బంగరు మేనికి
జలకము లాడెను పూర్ణమ్మ;
వదినెలు పూర్ణకు పరి పరి విధముల
నేర్పులు మెరసీ కై చేస్రీ.

పెద్దల కప్పుడు మొక్కెను పూర్ణమ
తల్లీ తండ్రీ దీవించి;
దీవన వింటూ పక్కున నవ్వెను
పుత్తడి బొమ్మా పూర్ణమ్మ

చిన్నల నందర కౌగిట చేర్చుకు
కంటను బెట్టెను కన్నీరూ;
అన్నల తమ్ముల కప్పుడు పలికెను
పుత్తడి బొమ్మా పూర్ణమ్మ.

"అన్నల్లారా తమ్ముల్లారా!
అమ్మను అయ్యను కానండీ!
బంగరు దుర్గను భక్తితో కొలవం
డమ్మల కమ్మా దుర్గమ్మ.

ఆ యా వేళల పూసే పువ్వుల
ఆ యా ఋతువుల పళ్ళన్నీ,
భక్తిని గోసి శక్తికి యివ్వం
డమ్మల కమ్మా దుర్గమ్మ.

నలుగురు కూచుని నవ్వేవేళల
నాపే రొకతరి తలవండి;
మీ మీ కన్నబిడ్డల నొకతెకు
పేరిమను నాపే రివ్వండి".

బల బల కన్నుల కన్నీ రొలికెను
పుత్తడి బొమ్మకు పూర్ణమకు
కన్నులు తుడుచుకు కలకల నవ్వెను
పుత్తడి బొమ్మ పూర్ణమ్మ.

వగచిరి వదినెలు, వగచిరి తమ్ములు
తల్లియు కంటను తడిబెట్టన్.
కాసుకు లోనై అల్లుని తలుచుకు
ఆనందించెను అయ్యొకడె.

యెప్పటి యట్టుల సాయంత్రమ్మున
యేరిన పువ్వులు సరిగూర్చి
సంతోషమ్మున దుర్గను కొలవను
వొంటిగ బోయెను పూర్ణమ్మ.

ఆవులు పెయ్యలు మందల జేరెను
పిట్టలు చెట్లను గుమిగూడెన్
మింటను చుక్కలు మెరయుచు పొడమెను
పూర్ణమ యింటికి రా దాయె.

చీకటి నిండెను కొండల కోనల
మేతకు మెకములు మెసల జనెన్
దుర్గకు మెడలో హారము అమరెను
పూర్ణమ యింటికి రా దాయె.

కన్నుల కాంతులు కలువల చేరెను
మేలిమి జేరెను మేని పసల్!
హంసల జేరెను నడకల బెడగులు
దుర్గను జేరెను పూర్ణమ్మ.

రాయప్రోలు సుబ్బారావు

# జన్మభూమి

ఏ దేశ మేగినా, ఎందు కాలిడిన
ఏ పీఠ మెక్కినా, ఎవ్వ రే మనిన
పొగడరా నీతల్లి భూమి భారతిని
నిలుపరా నీ జాతి నిండు గౌరవము
ఏ పూర్వపుణ్యమో, ఏ యోగబలమొ
జనియించినాడ వీ స్వర్గ ఖండమున
ఏ మంచి పూవులన్ ప్రేమించినావొ
నిను మోచె ఈ తల్లి కనకగర్భమున.

లేదురా ఇటువంటి భూదేవి యెందు
లేరురా మనవంటి పౌరు లింకెందు
సూర్యుని వెలుతురుల్ సోకునందాక
ఓడల జండాలు ఆడునందాక
అందాక గల ఈ యనంతభూతలిని
మనభూమివంటి చల్లని తల్లి లేదు
పాడరా నీ తెన్గు బాలగీతములు
పాడరా నీ వీరభావభారతము.

తమ తపస్సులు ఋషుల్ ధారపోయంగ
శౌర్యహారము రాజచంద్రు లర్పింప
భావసూత్రము కవిప్రభువు లల్లంగ
రాగదుగ్ధము భక్తరత్నముల్ పిదుక,

దిక్కుల కెగదన్ను తేజమ్ము వెలుగ
రాళ్ల తేనియ లూరు రాగాలు సాగ
జగముల నూగించు మగతనం బెగయ
సౌందర్య మెగబోయు సాహిత్య మలర
వెలిగిన దీ దివ్యవిశ్వంబు పుత్ర!
దీపించె నీ పుణ్యదేశంబు పుత్ర!
శైలముల రత్నాలు మొలిచెరా యిచట
వార్ధిలో ముత్యాలు పండెరా యిచట
పృథివి దివ్యౌషధుల్ పిదికెరా మనకు
కానల కస్తూరి కాచెరా మనకు
అవమాన మేలరా! అనుమాన మేల
భారతీయుడ నంచు భక్తితో పాడ!

విశ్వనాథ సత్యనారాయణ

# గ్రీష్మర్తువు

కోకిల మధువొల్కఁ గూసి యేమగుఁ దేనె
నేకరించెడు భృంగమే కడింది
రెండుజాముల యెండ మండి యేమగుఁ జల్ల
పాటున గొంతార్చు వడయె గడుసు
అల తొలిజాతిపండుల నేమి యగు సము
ద్ధతి నంటుమామిళ్ళ ధర పలికెడు
చలువ చేనూలువస్త్రము లెంత కగు వట్టి
యనద చీరలకె యత్యాదరంబు

గ్రీష్మ మరుదెంచి తన ప్రతాపోష్మ మురలి
కలిమి యధికార మప్పుతేఁ గలుగువారిఁ
గ్రొత్తరుచులకు మఱగించు కొంచు నేలు
బడిని సాఁగించెఁ బెఱజగ ముడుకఁబెట్టి.

దప్పిక కలవారి, రొప్పించి, యెండమా
వులదాఁక నీడ్చి, తావులను నెఱవు
చూపుమేఱన నీళ్ళు చూపి, చేర్పకయ యెం
డిననాల్క పిడచకట్టించి విఱుచు
సాయ మయ్యె నటంచు శైత్యోపచారమ్ము
లెడలించి నడకొట్టి యిడియఁ బెట్టు
అమృతాంశుఁ డరుదెంచె నని మింట నెఱపి యా
వెన్నెల పొరల నావిరులు వెట్టు

అధమపరివంచనా ప్రథమావతార
మూర్తి గ్రీష్మండు చనుదెంచె మొదట జనుల
నిస్సహాయులఁ జేసి మండించి, మండి
పిదపఁ బడమటిగాలితోఁ బిచ్చలించి.

గొంతుక్రిందటి యుండ గుడగుడ లాడఁగా
నఱ వ్రాఁదెఱచి తృషయైన కాకి
ప్రక్కఁ జన్ చీమలబారు చూడక, నిక్కి
నిలువక తలవాల్చి సొలయుఁ దొండ
పందిట లేచుచుఁ బండుకొంచును నాల్క
చాచి రొప్పుచుఁ జొంగ జార్చు కుక్క
కొఱకక పులు, ప్రక్క కుదురక తపియించి
యమ్మె యనుచు బిట్టు నడలు దూడ
నలిగిపోయిన పురికొసవలె, వడఁ గడ
గండ్లఁబడి, స్రుక్కిచను నల్లి కండ్లపాము
అల్ప ప్రాణులపైఁ బరమాధికారి
శేఖరుఁడు గ్రీష్మని ప్రతాపచిహ్న లయ్యె.

వడికి లంబాడి యొత్తడపుసంచుల పురి
కొసలాగఁ బాతిన కొయ్యగములు
తలకొట్టి గింజలు దులిపి మాలెఁత లేఁగ
నెండి ముండ్లగు బ్రహ్మదండిమోళ్ళు
జనము భీతినిఁ గన్నులను మూయఁ బ్రత్తిగా
లికి లేచు నెండు జిల్లేడుకాయ
లెనసి, ముండ్లయి కాళ్ళలను గ్రుచ్చుకొని నిక్క
చిఱుసూదు లగు నెండుగరికతలలు

ఎగసి మొగ మాచికొట్టెడు నెండ చాల
కురలి యురలి సుళ్లగ రేగి తరుము దుమ్ము
లిట్టె పసిమియన్నది యూడ్చిపెట్టు గ్రీష్మ
నాతపప్రతాపవహ్నికి నానవాళ్లు.

దక్షిణమ్ముపైని వస్త్రముకొంగు జారి క్రిం
దను నంటుకొన్నది దాలి నెగకు
దొడ్డిలోఁ బ్రొయ్యార్పి, తొలఁగ, నెక్కడొ రవ్వ
మిగిలి, పెన్గాలికి రగిలి యెగిరె
దూలమ్మునకుఁ ద్రాట వ్రేలనైన పఱపు
గట్టు నులక దివ్వె ముట్టుకొనియె
చిదుకుల మంటబోసిన దృష్టి తీసి, మి
ల్మిలఁ బ్రేలి చూరెక్కె మిరపతొడిమ

పురము, పేట, పల్లె, పరశురామప్రీతి
కాదిహేతువులుగ నాడుకొనిరి
నిందలేకయుండ బొందె పొదన్నట్లు
యమునివోని గ్రీష్మ నరయలేక.

ఆకాశమును భూమి, యగ్నిపత్రము వ్రాసి
కొన్నట్లు సుడిగాలి మన్నురేగె
గ్రీష్మానిలుఁడు వేయితెక్కలతో సాఁగి
నట్టులు శుష్కపత్రాళు లెగిరె
ఎండధాటికి నోడి యిల నోరు తెఱచిన
ట్టులుగ బీటిచ్చి నెర్రెలుగఁ బగిలె
అప్పులతో నాడి యూరిన వెలుఁగు నా
వెండి కాల్వలు చెర్వు లెత్తుపడియె

ఆర్ద్రమతి సుతిమెత్తని ప్రాణమట్లు
నవశిరీషపత్త్రావళుల్ నలిగిపోయె
గ్రీష్మవిధురాతపమ్ములు ఱెక్కనిలుపఁ
జాలని ద్విజాళివలెఁ బల్లటీలు కొట్టె

ఉదయ సూర్యునితోన యొడలెల్లఁ జితచిత
లై యెండ కొఱకొఱ లాడఁ దొడఁగె
ఇదియేమి నడుమింటి యెండయో వేనిప్పు
చేతులఁ దాఁకిన రీతినుండె
ఇనుఁ డస్తమించినాఁ డని పేరు, నెదురెండ
గొట్టిన వడ గూబ గుంయి మనియె
సొక్కు జాబిలి వలిగ్రుక్క త్రిప్పుకొను వే
ళకు రేయి రెండు జా ల్ప్రాకులాడె

ఆపసోపాలు పడి నిద్ర యనుచు ఱెప్ప
రాచునంతలో దీర్ఘ దీర్ఘమగు పగలు
గదుముకొన్న రేయి చివళ్ళు పొదిపి పొదిపి
అట్టె ధారుణి సర్వమ్ము పట్టుకొనియె.

చిబుకమ్ము చివర వేసిన సెగగడ్డకు
బాల గుండ్రమొగమ్ము కోలవారె
వడయెండలకుఁ గ్రాఁగి వడిలిపోయిన బాల
కడుఁ జూపులకుఁ గాని పొడుగు సాగె
బాల కృశోదరవ్యక్తరోమాళిరే
ఖాకాంతి నల్లనై పైకిఁదోఁచె
కనురెప్ప చలువ కద్దిన పచ్చకప్పురం
పు సిరమ్ము కోసచూపులు వెలార్చె.

కడును బాధగాఁ గార్శ్యంబుగాఁ వెలిఁగియు
తాను వేసఁగి యందాలుగాను సాఁగె

అందమగుచోట నందమ్మె యగును సర్వ
మన్న కవికులగురుమాట ననువదించి.

పానపౌన, పది యుబ్బచినుకులు పడి తేపు
కారాలు మిరియాలు నూరిపోసె
వడగాలి సాగినవట్టు సాఁగి బిగించె
నడికిరే, మఱి చల్లపడెడు వేళ
మబ్బింత మసలదు, మసలెనా మబ్బుచా
టెండ లక్షణగ నత్తెసరుపెట్టు
ఎండమావులు నాల్క యెండి చచ్చెడు ప్రాణి
నయనాల నీరాజనమ్ము పట్టె

నరు నఘానుభూతికి యాతనాశరీర
మన్న యట్టులు తాపమ్ము ననుభవింప
నైదు ప్రాణాలు చాలని యట్లు గాఁగ
వచ్చి వడగాలి యాఱవప్రాణ మయ్యె.

సాఁగివచ్చిన నదీచ్ఛలమున యజ్ఞోప
వీతముల్ తాల్చిన వేదమూర్తి
మృగశిర క్రొత్తకార్తెకు మొగిల్సోకు దు
ప్పటి కప్పుకొన్నట్టి భావవిదుఁడు
క్షేత్రేందిరకును నాగేటికఱ్ఱు పెకల్చి
పదను తెచ్చినయట్టి పాకయాజి
మాకందనవఫలామందతుందిలరసా
త్తానందభావుఁడౌ నమృతభోగి

శీవి వెలయించి జాలి గుండియను బైకిఁ
గానరానీని దొరవోలెఁ గదలివచ్చెఁ
గడు నధృష్యుండుఁ గడు నభిగమ్యుఁ డౌచుఁ
గేవలము పైకిఁ గఠినుండు గ్రీష్మరాజు.

దేవులపల్లి కృష్ణశాస్త్రి

# స్వేచ్ఛాగానము

**1**

తిమిరలత తారకా కుసుమముల దాల్ప
కర్కశ శిలయు నవజీవకళల దేర
మ్రోడు మోక చివురు లెత్తి మురువు సూప
జగము నిండ స్వేచ్ఛాగాన ఝరుల నింతు.

క్రౌర్య కౌటిల్య కల్పిత కఠిన దాస్య
శృంఖలములు తమంతనె చెదరి పోవ
గగనతలము మార్మ్రోగగ కంఠ మెత్తి
జగము నిండ స్వేచ్ఛాగాన ఝరుల నింతు.

చిత్త మానందమయ మరీచికల సోల
హృదయ మానందభంగ మాలికల దేల
కమల నానంద జవితాశ్రుకణము లూర
జగము నిండ సేచ్ఛాగాన ఝరుల నింతు.

యుగయుగంబుల నీశ్వరయోధు లగుచు
స్వేచ్ఛకై ప్రాణసుమము లర్పించువారి
అమల జీవిత ఫలము ధన్యతను గాంచ
జగము నిండ స్వేచ్ఛాగాన ఝరుల నింతు.

భయము గలిగించు కష్టాతపంబు మరచి
కరము కలగించు వంత చీకట్లు మరచి
విశ్వమే పరవశ మయి వెంట బాడ
జగము నిండ స్వేచ్ఛాగాన ఝరుల నింతు.

**2**

నవ్వి పోదురు గాక నా కేటి సిగ్గు ?
నా యిచ్ఛయే గాక నా కేటి వెరపు ?
కలవిహంగము పక్షముల దేలియాడి
తారకా మణులలో తారనై మెరసి
మాయ మయ్యెదను నా మధురగానమున !
నవ్వి పోదురు గాక నా కేటి సిగ్గు ?

మొయిలు దోనెలలోన పయనం బొనర్చి
మిన్నెల్ల విహరించి మెరపునై మెరసి
పాడుచు చినుకునై పడిపోదు నిలకు
నవ్వి పోదురు గాక నా కేటి సిగ్గు ?

తెలిమబ్బు తెరచాటు చెలిచందమామ
జతగూడి దోబూచి సరసాల నాడి
దిగి రాను దిగి రాను దివినుండి భువికి
నవ్వి పోదురు గాక నా కేటి సిగ్గు ?

శీకరంబులతోడ చిరుమీలతోడ
నవమౌక్తికములతో నాట్యమ్ము లాడి
జలధి గర్భమ్ము లోపల మున్గిపోదు
నవ్వి పోదురు గాక నా కేటి సిగ్గు ?

పరువెత్తి పరువెత్తి పవనునితోడ
తరుశాఖ దూరి పత్రములను జేరి
ప్రణయ రహస్యాలు పల్కుచు నుందు;
నవ్వి పోదురు గాక నా కేటి సిగ్గు ?

అలరుపడంతి జక్కిలిగింత వెట్టి
విరిచేడె పులకింప సరసను బాడి
మరియొక్క ననతోడ మంతనం బాడి
వేరొక్క సుమకాంత వ్రీడ బో గొట్టి
క్రొందేనెసోనల గ్రోలి సోలుటకు
పూవుపూవునకును బోవుచు నుందు;
నవ్వి పోదురు గాక నా కేటి సిగ్గు ?

పక్షి నయ్యెద చిన్ని ఋక్ష మయ్యెదను
మధుప మయ్యెద చందమామ నయ్యెదను
మేఘ మయ్యెద వింత మెరపు నయ్యెదను
అలరు నయ్యెడ చిగురాకు నయ్యెదను
పాట నయ్యెద కొండవాగు నయ్యెదను
పవన మయ్యెద వార్ధిభంగ మయ్యెదను

ఏలొకో యెప్పుడో యెటులనో గాని
మాయ మయ్యెద నేను మారిపోయెదను.
నవ్వి పోదురు గాక నా కేటి సిగ్గు ?
నా యిచ్ఛయే గాక నా కేటి వెరపు ?

శ్రీ శ్రీ

# దేశచరిత్రలు

ఏ దేశ చరిత్ర చూచినా
ఏమున్నది గర్వకారణం ?
నరజాతి చరిత్ర సమస్తం
పరపీడన పరాయణత్వం.

నరజాతి చరిత్ర సమస్తం
పరస్పరాహరణోద్యోగం :
నరజాతి చరిత్ర సమస్తం
రణరక్త ప్రవాహ సిక్తం.

బీభత్సరస ప్రధానం,
పిశాచగణ సమవాకారం !
నరజాతి చరిత్ర సమస్తం
దరిద్రులను కాల్చుకుతినడం.

బలవంతులు దుర్బల జాతిని
బానిసలను కావించారు :
నరహంతలు ధరాధిపతులై
చరిత్రమున ప్రసిద్ధి కెక్కిరి.

రణరంగం కానిచోటు భూ
స్థలమంతా వెదకిన దొరకదు :
గతమంతా తడిసె రక్తమున,
కాకుంటే కన్నీళులతో.

చల్లారిన సంసారాలూ,
మరణించిన జన సందోహం;
అసహాయుల హాహాకారం
చరిత్రలో మూలుగుతున్నవి.

వైషమ్యం, స్వార్థపరత్వం,
కౌటిల్యం, ఈర్ష్యలు, స్పర్థలు,
మాయలతో మారుపేర్లతో
చరిత్రగతి విరూపించినవి.

చెంఘిజ్ కాన్, తామర్లేనూ,
నాదిర్షా, ఘజ్నీ, ఘోరీ,
సికందరో ఎవడైతేనేం ?
ఒక్కొకడూ మహాహంతకుడు.

వైకింగులు, శ్వేతహూణులూ,
సిధియన్లూ, పారశీకులూ,
పిండారులు, థగ్గులు కట్టిరి
కాలానికి కత్తుల వంతెన.

అజ్ఞానపు టంధయుగంలో
ఆకలిలో, ఆవేశంలో—
తెలియని ఏ తీవ్రవశక్తులో
నడిపిస్తే నడిచి మనుష్యులు—

అంతా తమ ప్రయోజకత్వం,
తామే భువి కధినాథులమని,
స్థాపించిన సామ్రాజ్యాలూ,
నిర్మించిన కృత్రిమ చట్టాల్—

ఇతరేతర శక్తులు లేస్తే
పడిపోయెను పేక మేడలై!
పరస్పరం సంఘర్షించిన
శక్తులలో చరిత్ర పుట్టెను.

చిరకాలం జరిగిన మోసం,
బలవంతుల దౌర్జన్యాలూ,
ధనవంతుల పన్నాగాలూ
ఇంకానా! ఇకపై చెల్లవు.

ఒక వ్యక్తిని మరొక్క వ్యక్తీ,
ఒక జాతిని వేరొక జాతీ,
పీడించే సాంఘిక ధర్మం
ఇంకానా? ఇకపై సాగదు.

చీనాలో రిక్షావాలా,
చెక్‌దేశపు గనిపనిమనిషీ,
ఐర్లాండున ఓడకళాసీ,
అణగారిన ఆర్తులందరూ—

హాటెన్‌టాట్, జూలూ, నీగ్రో
ఖండాంతర నానా జాతులు
చారిత్రక యదార్థతత్త్వం
చాటిస్తా రొక గొంతుకతో.

ఏ యుద్ధం ఎందుకు జరిగెనొ?
ఏ రాజ్యం ఎన్నాళ్ళుందో?
తారీఖులు, దస్తావేజులు
ఇవి కావోయ్ చరిత్ర కర్థం.

ఈ రాణీ ప్రేమ పురాణం,
ఆ ముట్టడికైన ఖర్చులూ,

మతలబులూ, కైఫీయతులూ
ఇవి కావోయ్ చరిత్రసారం.

ఇతిహాసపు చీకటికోణం
అట్టడుగున పడి కాన్పించని
కథలన్నీ కావా లిప్పుడు :
దాచేస్తే దాగని సత్యం.

నైలునదీ నాగరికతలో
సామాన్యుని జీవనమెట్టిది ?
తాజమహల్ నిర్మాణానికి
రాళ్ళెత్తిన కూలీలెవ్వరు ?

సామ్రాజ్యపు దండయాత్రలో
సామాన్యుని సాహసమెట్టిది ?
ప్రభువెక్కిన పల్లకి కాదోయ్,
అది మోసిన బోయీ లెవ్వరు ?

తక్షశిలా, పాటలిపుత్రం,
మధ్యధరా సముద్రతీరం,
హారప్పా, మొహెంజొదారో,
క్రో - మాన్యాన్ గుహాముఖాల్లో.
చారిత్రక విభాతసంధ్యల
మానవకథ వికాసమెట్టిది ?
ఏ దేశం ఏ కాలంలో
సాధించిన దే పరమార్థం ?

ఏ శిల్పం ? ఏ సాహిత్యం ?
ఏ శాస్త్రం ? ఏ గాంధర్వం ?
ఏ వెల్గుల కీ ప్రస్థానం ?
ఏ స్వప్నం ? ఏ దిగ్విజయం ?

కాళోజి నారాయణరావు

# వ్యత్యాసాలు

అన్నపురాసులు ఒకచోట
ఆకలిమంటలు ఒకచోట
హంసతూలిక లొకచోట
అలసినదేహా లొకచోట
సంపదలన్ని యొకచోట
గంపెడుబలగం బొకచోట
వాసనసూనియ లొకచోట
మాసినతల లింకొకచోట
కమ్మని చకిలా లొకచోట
గట్టిదౌడ లింకొకచోట
బాహ్యబంధనము లొకచోట
భావబంధనము లొకచోట
కామిని వాంఛలు ఒకచోట
కౌగిలింత లింకొకచోట
తనువులు ఉండే దొకచోట
తలపులు ఉండే దొకచోట
కావ్యగానము లొకచోట
కావ్యపిపాసువు లొకచోట
కళాప్రదర్శన మొకచోట
కళారాధకులు ఒకచోట
సాహితీనిలయ మొకచోట
చదువరులంతిం కొకచోట
పెత్తనమంతిం కొకచోట
సత్తువ యంతింకొకచోట
అనుభవమంతా ఒకచోట
అధికారంబది యొకచోట.

బాలగంగాధర తిలక్

# ఆర్తగీతం

నా దేశాన్ని గూర్చి పాడలేను, నీ ఆదేశాన్ని మన్నించలేను,
ఈ విపంచికకు శ్రుతి కలుపలేను,
ఈ రోజు నాకు విషాదస్మృతి, విధి తమస్సులు మూసిన
దివాంధరుతి,
నా యెడద మ్రోడైన ఒక దుస్థితి.

నీ కొత్త సింగారమ్ము వలదు, ఉదాత్త సురభిశాత్త
శయ్యాసజ్జితమ్ము వలదు,
రసప్లావితము వలదు,
చిత్రశిల్ప కవితా ప్రసక్తి వాంఛింపను, తత్వసూత్ర
వాదోక్తి చలింపను,
సుందర వధూ కదుష్ణ పరిరంభముల రసింపను,
గత చారిత్రిక యశఃకలాపమ్ము వివరింపకు, బహుళ
వీరానేక గాథాసహస్రమ్ము వినిపింపకు,
ఇంక నన్ను విసిగింపకు,

నేడు నేను కన్నీరుగా కరిగిన గీతికనే, సిగ్గుతో రెండుగా
చీలిన వెదురు బొంగును,
మంటలో అంతరాంతరదగ్ధమైన బూడిదను,
పైన దైవమునకు, కింద మానవునకు జవాబు చెప్పవలసిన వాణ్ణి,
రసాతల మంట శిరస్సు వంచినవాణ్ణి.

ఈజు నేను చూసినదేమి? విధి యిన్ని కత్తులను
దూసినదేమి?
జాగృతి హేతి వాదరల రుధిరమేమి?

చూశాను నిజంగా ఆకలితో అల్లాడి మర్రిచెట్టు
కింద మరణించిన ముసలివాణ్ణి;

చూశాను నిజంగా నీరంధ్ర వర్షాన వంతెనకింద
నిండు చూలాలు
ప్రసవించి మూర్ఛిలిన దృశ్యాన్ని;

చూశాను నిజంగా తల్లి లేక తండ్రిలేక తిండిలేక
ఏడుస్తూ ఏడుస్తూ
చేతుల కన్నులు తుడుచుకుంటూ మురికికాల్వ
పక్కనే నిద్రించిన మూడేళ్ళ పసిబాలుణ్ణి;

ను చూశాను నిజంగా పిల్లలకు గంజికాచిపోసి
తాను నిరాహారుడై
ద్ధబాష్పాకులిత నయనుడై ఆఫీసుకు వచ్చిన వృద్ధుని
ప్యూన్ బీరన్నని;

నేను చూశాను నిజంగా క్షయగ్రస్త భార్య యిక బతకదని
డాక్టరు చెప్పినపుడు
ప్రచండ వాతూల హత నీపశాఖవలె గజగజ
వణికిపోయిన అరక్త అశక్త గుమాస్తాని,
అయిదారుగురు పిల్లలు గలవాణ్ణి;

నేను చూశాను నిజంగా మూర్తీభవత్ దైన్యాన్ని, హైన్యాన్ని,
క్షుభితాశ్రు కల్లోల నీరధుల్ని, గచ్ఛత్ శవాకార పికారుల్ని

ఇది ఏ నాగరికతకు ఫలశ్రుతి? ఏ విజ్ఞాన ప్రకర్షకు ప్రకృతి?
ఏ బుద్ధదేవుడి జన్మభూమికి గర్వసమ్మతి?

ఇంకనన్ను నిర్బంధించకు నేస్తం ఈ రాత్రినేను
పాడలేను; ఈ
కృత్రిమవేషాన్ని అభినయింపలేను
మానవత లేని లోకాన్ని స్తుతింపలేను
మానవునిగా శిరసెత్తుకు తిరగలేను
ఈనాగరికతారణ్యవాసం భరించలేను.

ఒక్క నిరుపేద వున్నంతవరకు, ఒక్క మలినాశ్రు
బిందు వొరిగినంతవరకు,
ఒకపేగు ఆకలి కనలినంతవరకు.

ఒక్క శుష్కస్తన్య సన్నిధిని క్షుధార్తి నేడ్చు పసిపాప
ఉన్నంతవరకు,

ఒక తల్లి నీరవాక్రోశ రవమ్ము విన్నంతవరకు.
ఒక క్షత దుఃఖిత
హృదయ మూరడిల్ల నంతవరకు,

నాకు శాంతి కలగదింక నేస్తం, నేను విగర్విణై నాను,
ఈ సిగ్గులేని ముఖాన్ని
చూపించలేను.

ఈ గుండె గూడుపట్లు ఎక్కడో కదిలినవి, ఈ కనులు
వరదలై పారినవి,
ఈ కలలు కాగితపు పేలికలై రాలినవి.

ఈ ఆర్తి ఏ సౌధాంతరాలకు పయనింపగలదు ?
ఏ రాజకీయవేత్త గుండెలను
స్పృశించగలదు ? ఏ భోగవంతుని
విచలింప చేయగలదు ? ఏ భగవంతునికి
నివేదించు కొనగలదు... ?

కుందుర్తి ఆంజనేయులు

# తప్పిపోయిన సత్యం

జోహారు లర్పిస్తున్నాను
మానవ జాతి గుండెల్లో
జ్యోతులు వెలిగించిన నేతకు
కోప తాపాలకు బానిసైన
కోతి లాంటి మానవుడికి
తెలివి తెచ్చి దేవుణ్ణిగా చేసిన
అహింసా పథ నిర్ణేతకు

జోహారు లర్పిస్తున్నాను
జాతి పర్రిజల వూహల పొలాలలో
నీతికి నాగ్లేసిన నేతకు
ఊరికి దూరంగా దిగులుగా
దీనంగా కూచున్న మాలను
దేశమాత కంఠ మణిమాలగా
తీర్చిన భారత భవితవ్య నిర్ణేతకు

జోహారు లర్పిస్తున్నాను
మానవ జాతి గుండెల్లో
జ్యోతులు వెలిగించిన నేతకు

అంతవరకే యీ పద్యం అందంగా ఉంటుంది
తరువాత ఋరితి మారిపోతున్నది

క్షమించండి సదస్యులు నన్ను
ఆ యేటి కాయేడు నా లోని ఆశ

ఆవిరిగా మారిపోతున్నది
నీతి నీరుగారి పోతున్నది

బాపూ, ఎక్కడుంది
నీ కప్పుడు కనిపించిన సత్యం ?
ఏ నాటికి దొరుకుతుంది దేశంలో
నాకు నచ్చిన సజ్జన సాంగత్యం ?

నీవా నాడు చచ్చావు కనుక
నిజంగా బ్రతికి పోయావు
బాపూ, నువ్విప్పుడు బ్రతికే వుంటే
పిస్తోలుతో మరణం కాదు
చిత్రవధ జరిగి వుండేది నీకు !
చావో బ్రతుకో తెలియని
సందిగ్ధ జీవిత సంధ్యా సమయంలో
ఊహలూ ఉద్బోధలూ మానేసి నీయంతట నీవు
ఉరి పోసుకుని వుండేవాడివి
బాపూ, నువ్విప్పుడు బ్రతికే వుంటే
పచ్చి వెలక్కాయల్లాంటి ప్రశ్నల బాణాల్ని నీ
గొంతుకు గురిచూసి కొట్టేవాణ్ణి
బాపూ, నన్నీ సారికి క్షమించు
హిరణ్య కశిపుడి రీతిలో అడుగుతున్నాను
ఎక్కడుంది నీ వన్న సత్యం ?

ఏట్లోనా ?
కాపుసారా ఘుమ ఘుమల కంపు కొడుతున్న నోట్లోనా ?
నా బోటి వారు తెలియక తలదూర్చిన
ఈ ప్రపంచపు రోట్లోనా ?
ప్రక్కనే జాలి చూపుతూ నుంచున్న నటకుల కన్నీట్లోనా ?
జీవిత చరమాంక రంగస్థలమైన వల్లకాట్లోనా ?

ఎక్కడుంది నీ సత్యం ?
ఏ నాటికి దొరుకుతుంది
ఈ దేశంలో నాకు సజ్జన సాంగత్యం ?
ఆ నాడు నీ కాలిగోటిని చూసి
సామ్రాజ్యాలు తలవంచుకున్నాయి
నేడు శిష్యులమైన మమ్మల్ని చూసి సిగ్గుపడి
చరిత్రలో తలదాచుకున్నావు నువ్వు
ఇదిగో నేడు !
నీ శతజయంతి పుణ్య దినాన
ఇదే నేడు మా ప్రతిజ్ఞ

భారతం మా ఆది కావ్యం కనుక
బైటికి కనిపించే మా ఊహాల వెనుక
అన్నదమ్ముల తగాదాల నిప్పును
ఆరకుండా పోషించుకుంటూ వుంటాం !

అహింసాది నీ సమస్త సిద్ధాంతాలను
ఆచరించడం మా విషయంలో అలా వుంచి
భవిష్యత్తులో వచ్చే తరాల వారి కోసం
పాలరాతి శిలా ఫలకాల మీద
భద్రంగా రాసి వుంచుతాం

ఆర్జనకు వీలున్న ప్రతి చర్యనూ
అనుసరిస్తాం నిర్మాణ కార్యక్రమంగా
నీ పేరు ఆద్యంతాలలో వుంచి
మా ప్రజాక్షేమానికి పాటు పడతాం !

భార్యలా ప్రేమతో చూసుకుంటాం
బజార్లో కనిపించిన ప్రతి స్త్రీని !

జేబు కాస్త తడి చేసిన ప్రతి ఆశ్రితుణ్ణి
జీవితాంతం కన్న బిడ్డలా చూసుకుంటాం

"కనబడడం లేదు" అనే శీర్షిక క్రింద
తప్పిపోయిన "సత్యం" ఫోటో, గుర్తులూ
పత్రికల్లో అచ్చు వేయించి
ఆచూకీ తెలిపిన వారికి
పెద్ద బహుమతులు ప్రకటిస్తాం

సామాన్య మానవుడి పేరు
సర్దార్ మానవుడుగా మార్చి
సంఘంలో అతనికి పెద్దలతో పాటు
సమానమైన హోదా సాధిస్తాం
సోషలిజం సాధనలో
ఇది తొలి మెట్టు అని వాదిస్తాం

దరిద్ర నారాయణుల సంక్షేమం కోసం
మా పార్టీల కార్యకలాపాల బడ్జెట్‌లో
సభలూ సందేశాలూ చాలినన్ని కేటాయిస్తాం

ఆశల మేఘాలు కల్పించి
పదునైన ప్రసంగాల వానలు కురిపించి
సెంటు పొలం లేని సామాన్యుల గుండెల్లో
సంతృప్తి సస్యం పండిస్తాం

అనావృష్టికి గురి అవుతున్న మా
ఆంధ్ర దేశపు పొలాలను
తప్పతాగి కక్కిన సారా జలంతో
తడుపు కుంటాం ! కండ్లు తుడుచుకుంటాం !

సత్యాహింసల చట్టానికి కావలసిన
సవరణలు ప్రతిపాదించుకుంటాం
మనుషులంగా పైకి కనిపించడానికి
కావలసిన రంగులన్నీ వేసుకుంటాం

ముందుగానే చెప్తున్నాను
నిజంగా నీ మీద ఒట్టు
వచ్చే యేడు నీ జయంతి సభ లోకి
చింత నిప్పుల్లాంటి కండ్లతో
ఒయ్యారంగా తూలుతూ సోలుతూ వచ్చి
"ఎవడ్రా గాంధి" అని అడక్కపోతే

నా పేరు మార్చు పేరు పెట్టు
జోహారు లర్పిస్తున్నాను
మానవ జాతి గుండెల్లో
జ్యోతులు వెలిగించిన నేతకు.

దాశరథి

# మంజీర

ఎవరి గజ్జెల రవళివే నీవు మంజీర !
ఎవరి కజ్జల బాష్పధారవే ! మంజీర !
నీవు పారిన దారిలో ఇక్షుదండాలు
నీవు జారిన జాడలో అమృతభాండాలు

నీవు దూకిన నేల మాకు విద్యున్మాల
నీవు ప్రాకిన పథము మాకు చైత్రరథమ్ము
ఎవరికోరకయి పరుగులెత్తి వచ్చితివి ?
ఎవరి జూచి తటాకమై నిల్చిపోతివి ?

జీరలువడ్డ నా గళము
        జేరి నవధ్వని జాలువార్చు మం
జీరవు నీవు; నీ వెలుగు
        జిందెడి చక్కని దేహవల్లి కే
చీరలు కాన్క తేగలను
        చెప్పుము తెల్గునదీ ! తెలుంగు బం
గారపు రంగు లద్దిన
        విగారపు కావ్యదుకూలముల్ వినా ?

ఆకలి తీర్చుకన్న ఘన
        మైన మహోదయజనమ్ము కాన మీ
లోకమునందు; నీ మనసులో
        నొకనాడు తదీప్సితమ్ము చీ
కాకొనరింప వాకవయి,
        కాలువవై, ఝరివై, తటాకమై

మాకొరకేగుదెంచితిసుమా !
    కమనీయ పయోభరమ్మునన్.

శిలగా నే గిరిసీమ డాగితివొ
    మంజీరా ! శతాబ్దాలు ని
శ్చలవృత్తిన్ పలుకేని లేక నొక
    వృక్షచ్ఛాయ దుష్టాత్మ గుం
డెలలో ద్వేషమువోలె ఇంచుకయినన్
    హృద్యమ్ముగా; కిప్డు క
న్నుల నీరై ఇటు జారినావు దయ
    తోనో, ప్రేమభావాననో !

నిను కరగించి తెచ్చిన పునీతు
    డెవం ? డతనిన్ భగీరథుం
డనవలె; వాడు నా తెలుగు
    టంగణమందలి ముండ్లదుబ్బులన్
తునియలు కొట్టి ఈ చెరుకు
    తోటల గూర్చి హలమ్ము గ్రుమ్మి, భూ
మిని ప్రసరింపజేసి పసిమిన్
    మిసిమిన్ పెకలించె దండిగా.

ఆతడు నేలదున్ని బ్రతు
    కంతయు పస్తులు పన్న రైతు మా
పోతన యేమొ ! వాని వడ
    పోతలలో కవితాప్రపంచ మా
పాతమనోహరమ్మయిన
    పల్కు జగద్విదితమ్ము; వాని సం
గాతము నీకు కావ్యతను
    కల్పన చేసినదోయి, వాహినీ !

ఒకట నదివయి, ఒకచోట నొదిగి యొదిగి
సాగరమవై చలింపక సమసియుంటి
వెంత సౌమ్యస్వభావమోయీ ! పరుంగు
లిడు మనస్సును బంధింప దొడగినావు.

ఇందూరుమండలం బెందాక నీనీటి
తడి తాకి తీయని తనమునొందు,
నా తెలంగాణమ్ము గీతనృత్తములతో
నెందాక నిన్ను పూజించుచుండు,
నెందాక నిరుపేద లంది నీ జలధార
పండింతుర్రి కొల్లగా పైరుపంట,
లే కవీశులు నీ మహాకావ్యత నెరింగి
తమ కలమ్ములకు సౌందర్య మిడుదు

రంతదాక మహీమండలాంతరమున
నీ వెలుంగుకు రవ్వంత నీడ రాదు,
దివ్య గోదావరీ గృహాంతికమునందు
నీ విలాస మేనాటికి నిలిచిపోదు.

రుద్రవీణ తీవమాద్రి ఝంఝమ్మని
తరగ లెత్తి వచ్చుదాన వీవు;
నా మనస్సులోన నాదాలు కల్పించి
స్పందనమ్ము నేర్ప జాలినావు.

నా తెలుగువీణ పోయిన మూర్ఛనలు నేడు
నీవుగా పారినిండినవి నా భూమిలో;
ఇక ఎన్ని చెరకుతోటలు పండ వీచోట ?
ఎన్ని చక్కెరమిల్లు లివురింపవు ?

ఎవ్వరే యెదురొచ్చి ఏడుపాయలు చేసి
రవ్వల్ల వీణపై రాగమొత్తిరి నిన్ను ?
ఏడుపాయల దుర్గ యేమన్నదే నిన్ను ?
యేమన్నదే నిన్ను యేడుపాయల దుర్గ ?

( మంజీరా మౌనభంగం )

ఏడుపాయల దుర్గ ఎదురుగా వచ్చింది
పాడుకొమ్మన్నాది పరుగులిడమన్నాది
స్వర మొక్క పాయగా సాగిపొమ్మన్నాది
బంగారు పండించి ప్రజల కిమ్మన్నాది.

( మంజీరకు విశ్రాంతి )

అదిగో హసంతికలు, అదె సుమ లలంతికలు
అదిగొ నేమంతికలు, అదిగొ వాసంతికలు
జయదాయకములు, సంశయ మాయకమ్ములు
ప్రియకరము లమృతపిచ్ఛిలము లుజ్జ్వలములు

మిట్ట లెక్కియెక్కి గుట్టలు దిగజారి
త్రోవ గడచి వచ్చినావు నీవు.
మిగుల శ్రమలుగొన్న మిసిమింతు రాలవు
సేదదీరుమీ ప్రసిద్ధ భూమి.

# గురజాడ అప్పారావు

## 'పూర్ణమ్మ'

కవిపరిచయం:

జననం: క్రీ.శ. 1862, సెప్టెంబర్ 21

తలిదండ్రులు: కౌసల్యమ్మ వేంకటరామదాసులు

జన్మస్థలం: విశాఖ జిల్లా, యలమంచిలి తాలూకాలోని 'రాయవరం' గ్రామం

కళలకూ శాస్త్రవిద్యలకూ నిలయమైన విజయనగరం మహారా[ిజా] ఆనందగజపతులవారి ఆస్థానంలో గురజాడ కొంతకాలం ఉద్యోగి[గా] ఉన్నారు.

తెలుగులోకంటే ముందే 'సారంగధర' వంటి ఆంగ్ల రచన[లు] చేసి దిద్దుబాటు, మీపేరేమిటి వంటి కథలూ నీలగిరి పాటలూ వ్రాసా[రు]. పుష్పలావికలు, మాటల మబ్బులు, మెరుపులు, సుభద్ర వంటి సంప్ర[]దాయ రీతి రచనలు చేసి తదుపరి వీరేశలింగం వంటి వారల సంఘ సంస్కరణోద్యమాల చేతను గిడుగువారి వ్యావహారిక భాషావాదోద్యమా[ల] చేతను ప్రభావితులై 'కన్యాశుల్కం' 'కొండుభట్టీయం' వంటి నాటకాలన[ు] 'ముత్యాలసరాలు' వంటి గేయ కావ్య సంపుటినీ సంతరించి తరువా[తి] కవులకు వైతాళికుడుగా నిలిచిన ఆధునిక సాహిత్య యుగకర్త, మహా కవి. వారి దేశభక్తి గీతం మానవకోటి మనుగడని మహత్తర సందే[]శానికి నిదర్శనం.

పాఠ్యపరిచయం:

ప్రస్తుత పాఠ్యాంశం పూర్ణమ్మ గురజాడగారి 'ముత్యాలసరాలు' అనే ఖండకావ్యం నుండి తీసుకోబడింది.

పూర్ణమ్మ ఒక పూజారి కూతురు. చిన్నతనంనుండే పూలుపండ్లు నివేదించి దుర్గాదేవిని ఆరాధించేది. కాసుల కోసం ఆమె తలిదండ్రులు పుత్తడి బొమ్మవంటి ఆ బాలికను ఒక ముసలి వాడి కిచ్చి పెళ్ళిచేశారు. తన మగడు ముసలివాడని తెలిసి, తోటి స్నేహితురాళ్ళు 'తాత తాత' అని గేలిచేస్తూ ఉంటే ఏమి చేయలేక పూర్ణమ్మ దుర్గవద్దకు వెళ్ళి దుఃఖిచేది. కొన్నిదినాలకు భర్త తనను తీసుకొనిపోవుటకు రాగా అందరి వద్దా వీడ్కోలు తీసికొని, ఎప్పటిలాగే సాయంకాలం దుర్గను సేవించుటకు కోవెలకు వెళ్ళిన పూర్ణమ్మ తిరిగిరాలేదు. పూర్ణమ్మ ధరించిన ఆభరణాలు దుర్గాదేవికి అలంకరింపబడి ఉన్నాయి.

డబ్బు కోసం కక్కుర్తిపడి ముక్కుపచ్చలారని బంగరు బొమ్మల వంటి తమ ముద్దుబిడ్డల్ని బాల్యం తీరకముందే వృద్ధుల చరమజీవితానికి బలి చేసి ఆడబిడ్డల జీవితాన్ని ఎలాగ విషాదాంతం చేసేవారో ముత్యాల సరాలలోని ఈ పూర్ణమ్మ రచన తెలియచేస్తుంది.

ముఖ్య పదవివరణ:

"ముత్యాల సరాలు" అనబడే ఈ గేయ రీతి యతి ప్రాసలవంటి పూర్వ పద్య రచనలలోని నియమాలు అంతగాలేని గురజాడ గారి నూతనసృష్టి. మాత్రాఛందోనియమంలో వృషభగతిరగడను పోలి ప్రతి పాదానికి 14 మాత్రలు కలిగి మూడున్నర పాదాలతో గేయంగా రూపు దిద్దుకొని తరువాతి యువకవుల గేయకవితారీతికి ఒరవడి పెట్టింది.

నడలు - నడకలు

సౌరులు - అందాలు

"పళ్ళమీరిన ... ... నడలును

పూర్ణమ్మ నడకలు పళ్ళను మీరిన తీపికలవని వర్ణించేచోట నడకలు అంటే పదవిన్యాసం- కవిత్వంలోని పదవిన్యాసం వంటిదని కావ్యాలలోని ప్రసిద్ధములైన ప్రసాద మాధుర్య గుణములలోని మాధుర్య గుణమే పూర్ణమ నడకలలోనూ ఉందని భావం.

పోడుములు - అందములు

పువ్వులు ...... పూర్ణమ్మ అందం పువ్వులతో మాత్రమే పోల్చి తత్పూర్వం ప్రబంధ కవులు చేసిన అంగాంగ వర్ణన పద్ధతికి స్వస్తి చెప్పి ఔచిత్యానికి పట్టం కట్టారు గురజాడ.

ఆమని - వసంతం

కేలించ - ఎగతాళిచేయగా

"పెద్దలకప్పుడు ...... పక్కన నవ్వేను"

పూర్ణమ్మ తన తలిదండ్రులదీవనలు "దీర్ఘ సుమంగళీభవ" వంటివి విని పొందిన వేదనను బయలుపరచక వారి అవివేకానికి నవ్వటం ఆమె మానసిక పరిపక్వతను తెలియచేస్తుంది.

బెడగు - అందము

'కన్నులకాంతులు ...... దుర్గను జేరెను.'

పూర్ణమ్మ దుర్గలో ఐక్యమైంది. అనగా ఆమె పంచేంద్రియాలు ప్రకృతిలోను ప్రకృతిస్వరూపిణి అయిన దుర్గలోను ఇమిడి రూపాంతరం చెందినవన్నమాట. ఒకవైపు ఆమె సౌందర్యం వర్ణిస్తూ మరోప్రక్క అవి ప్రకృతిలో అంతర్లీనం అవుతున్నట్లు వర్ణించటం గురజాడ గారి చమత్కారవ్యంగ్య వైభవానికి నిదర్శనం.

భక్తితో వంటి విభక్తిప్రత్యయాల హ్రస్వీకరణం పూర్ణమ్మను వొక, వేస్తీ చేస్తీ వంటి సంప్రదాయ వ్యాకరణ విరుద్ధ ప్రయోగాలు

విరళ పదబంధాలు వ్యావహారిక భాషను ప్రయోగించి వ్యాప్తిలోకి తేవటానికీ సాహిత్యం అబాలగోపాలం పఠనీయం చేయాలనే సంకల్పానికీ నిదర్శనం.

అందుకే 'పూర్ణమ్మ' కథను కరుణరసాత్మకమైన ఒక సంక్షిప్త గేయకావ్యంగా పేర్కొనవచ్చు.

## రాయప్రోలు సుబ్బారావు

### 'జన్మభూమి'

కవిపరిచయం:

జననం: 1892, మార్చి 13

జన్మస్థలం: గుంటూరు జిల్లా, బాపట్ల తాలూకాలోని గార్లపాడు.

ఆంధ్రవాఙ్మయంలో ఆధునిక సాహితీ ప్రయోక్తలుగా చెప్పుకోదగిన కవిత్రయంలో మొదటి యిరువురు కందుకూరి గురజాడలు కాగా మూడవవాడుగా పేర్కొనదగిన మనీషి రాయప్రోలు సుబ్బారావు గారు. నవ్యకవిత్వానికి కవిబ్రహ్మగా భావకవిత్వానికి సూత్రధారుడుగా అమలిన శృంగారతత్వ ప్రబోధకుడుగా ప్రస్తుతింపబడిన ఆధునికసాహితీ యుగకర్త. క్షీణప్రబంధయుగంలోని శృంగారదృష్టిని ఏవగించుకొన్న సమకాలీన సాహితీలోకానికి రమ్యమైన ఆలోకనం మాధురీ దర్శనం కలిగించటానికే ప్రణయ ధర్మాన్ని ఉపాసించే అమలిన శృంగారతత్త్వాన్ని బోధించాడు, కష్టకమల, స్నేహలత, స్వప్నకుమారం వంటి కావ్యాలు పై తత్వాన్ని నిర్దేశించే రచనలు. జడకుచ్చులు, మిశ్రమంజరి, వనమాలి, తెనుగుతోట వారి ఖండకావ్యాలు. మధుకలశం, దూతమత్తేభం, లలిత, ఉత్తరరామచరిత్ర, సౌందర్యలహరి వంటివి అనువాద రచనలు. ఆంధ్రావళి, తెలుగుమాన్యము, దేశభక్తి ప్రబోధాత్మకమైన

కవితా సంపుటాలు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలోను వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలోను ఆంధ్రశాఖలకు తొలి అధ్యక్షులు. వారు వరంగల్ లోని ఆర్ట్స్ అండ్ సైన్సు కళాశాలకు 29-10-1947 నుండి ఒక సంవత్సరం పాటు అధ్యక్షులుగా పనిచేశారు.

పాఠ్యపరిచయం:

ప్రస్తుత పాఠ్యాంశం రాయప్రోలు గారి "ఆంధ్రావళి" నుండి తీసుకోబడింది. "జన్మభూమి" గేయం ఆకారంలో అల్పంగా కనబడి నప్పటికీ నాటినుండి నేటివరకు నిఖిలాంధ్రుల నాలుకల మీద నిత్యనివాసం చేయటమేకాక "ఏదేశ మేగినా ఎందుకాలిడినా" అన్నది తెలుగుపలుకు బడులలో ఒకటిగా నిలిచిపోయింది.

భారత జాతీయోద్యమ ప్రభావం దేశంలోని అన్ని ప్రాంతాలతోబాటు ఆంధ్రదేశంలోని నవ్యకవుల హృదయాల మీద గూడా బీజావాపన చేసింది. తత్ఫలితంగా అనేకులు భారత జాతీయోద్యమాన్ని జాతి గతవైభవాన్ని కీర్తిస్తూ కవితారూపంలో ప్రబోధించారు. చిలకమర్తి, గురజాడ వంటి వారల కవితలలో అంకురించిన దేశభక్తిలత రాయప్రోలు వారి కవితా వేశంతో బహుముఖాలుగా విస్తరించింది. తరువాత వీరి ప్రభావంతో విశ్వనాథ, కొడాలి, దువ్వూరి, తుమ్మల, జంధ్యాల వంటివారు దేశభక్తి పూరితాలైన కవితలెన్నో వెలువరించడం జరిగింది.

భారత స్వాతంత్ర్య సంగ్రామపు రోజుల్లో కవితల ద్వారా భావ విప్లవం తీసుకరావటానికి దోహదం చేసిన రచనల్లో రాయప్రోలు గారి జన్మభూమి అగ్రగామిగా సాగింది.

అంతేకాక గురజాడవారి దేశభక్తి గేయం తరువాత దేశీయులలో జాతీయభావ దీపం వెలిగించి, దేశభక్తి గీతాలకు మకుటాయమానంగా ప్రకాశించి, జాతీయోద్యమ కాలంలో అనేక సభలలో గానం చేయబడి

జాతీయాభిమానాన్ని యువ హృదయాల్లో రక్తంతో బాటు ప్రవహింప చేసిందీ గేయం. "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపిగరీయసీ" అనేసూక్తి "జన్మభూమి"లో సహస్రపత్రంగా వికసించినట్లు తోచకమానదు. నా దేశం నా జాతి నాభాష అనే స్వరూప దర్శనాన్ని స్వజాతి గౌరవాన్ని ఆంధ్రులలో కలిగించి దేశభక్తికి నిత్యజీవదులలాగ విలసిల్లినవి రాయప్రోలువారి "జన్మభూమి" "ఆంధ్ర" వంటి గేయకవితలే. 'లేదురా ఇటువంటి భూదేవి యెందు............ అనుమానమేల భారతీయుడనంచు భక్తితో పాడ' మొదలైన పాదాలు జాతీయాభిమానాన్ని ఎగరేసే పతాకలు. 'తమ తపస్సులు ఋషుల్......'మొదలైన పంక్తులు ప్రాచీన వైభవానికి ప్రతీకలు.

## విశ్వనాథ సత్యనారాయణ

### 'గ్రీష్మర్తువు'

కవిపరిచయం:

జననం: 1895, సెప్టెంబర్ 10

నిర్యాణం: 1977, అక్టోబర్ 18

జన్మస్థలం: కృష్ణాజిల్లా, గుడివాడ తాలూకాలోని నందమూరు.

ఆధునిక యుగంలో ఆంధ్ర సాహిత్యాన్ని సంపన్నం చేసిన సంప్రదాయ కవి మహోదయులలో విశ్వనాథ సత్యనారాయణగారు శిరోమణి వంటివారు. వివిధములైన తెలుగు సాహిత్య ప్రక్రియలలో మేటి రచనలు చేసిన కవిత్వ కళాప్రపూర్ణులు. అఖిలభారత స్థాయిలో ప్రతిష్ఠాకరమైన జ్ఞానపీఠ పురస్కారం విశ్వనాథవారి రామాయణ కల్పవృక్షానికి లభించినది. విశ్వనాథ రచనలలో మహాకావ్యములలో రామాయణ కల్ప

వృక్షము, నవలలో వేయిపడగలు, గేయములలో కిన్నెరసాని, నాటకములలో నర్తనశాల, విమర్శలలో నన్నయగారి ప్రసన్న కథాకలితార్థయుక్తి వారి ప్రతిభ క్షేత్రమునుండి వెలువడ్డ అనర్ఘరత్నములు. ఆయన శతాధిక గ్రంథకర్త.

పాఠ్య పరిచయం:

ప్రస్తుత పాఠ్యాంశము విశ్వనాథగారి "ఋతుసంహారము" అను కావ్యము నుండి గ్రహింపబడినది. ఒక సంవత్సర కాలములో వచ్చు నారు ఋతువులలో తెలుగు పల్లెసీమల అందచందాలను జీవనసరళిని విశ్వనాథవారు ఈ కావ్యములో వర్ణించినారు. విశ్వనాథ వారి ఈ కావ్యము స్వతంత్ర వర్ణనభరితమైనది. ఆరు ఋతువులలోను ధనికులకు దరిద్రులకు కూడ అనువైనకాలం గ్రీష్మర్తువు. ఇందులో విశ్వనాథవారి ప్రకృతి పరిశీలన పాటవం, భావుకత, వారి శైలి రసోచితపద సంకలితమై ప్రాణిలోకము యొక్క నైసర్గిక జీవనాన్ని కనులముందు నిలుపుచున్నది.

ముఖ్య పదార్థ వివరణ:

కడింది - గొప్ప

చల్లపాటున - చల్లబడిన తరువాత

తొలిజాతి పండులు - ఉసిరికపండ్లు

అనదచీరలు - పలుచని వస్త్రములు

ప్రతాపోష్మము - తాపము వలన కలిగెడు చెమట

ఉరలి - జాటి

రొప్పించి - పురికొల్పి

ఇడియబెట్టు - సొమ్మసిల్లజేయు

సాయమయ్యె - సంధ్యాకాలమైనది

అధమ,.....మూర్తి - పచ్చి మోసము చేయుటలో మొదట లెక్కింపదగినవాడు

పిచ్ఛలించి - విజృంభించి, చెలరేగి

ఆఱవాదెఱచి - సగమునోరు తెరచి

తృష - దప్పిక, పులు - గడ్డి

పరమాధికారిశేఖరుడు - గొప్ప అధికారముగల వారిలో శ్రేష్ఠుడు

కొయ్యగములు - గూటముల వరుసలు

దాలి - పాలుకాగపెట్టటానికి గుంట త్రవ్విపెట్టిన పిడకలపొయ్యి

పరశురామ ప్రీతికి - తగులబడటానికి, అగ్నిప్రమాదానికి

గ్రీష్మవిధురాతపమ్ములు - గ్రీష్మర్తువులోని హానికరములైన యెండలు

జాలు - జాములు

సిరమ్ము - చల్లనిది

కవికులగురువు - కాళిదాసు

అఘానుభూతికి - పాపానుభవము కొరకు

పాకయాజి - హోమార్థము అన్నము వండెడువాడు

(నాగలికర్రును పదనుపెట్టుటకు కమ్మరి కొలిమిలోపెట్టి వేడి చెసినట్లే గ్రీష్ముడు తన సహజమైన ప్రతాపముతోనే నాగలి కర్రుకు పదను కలిగించేవాడని అర్థము)

అధృష్యుడు - ఎదిరింపరానివాడు, తేరిచూచుటకు వీలుకానివాడు

అభిగమ్యుడు - సమీపించుటకు వీలైనవాడు

## దేవులపల్లి కృష్ణశాస్త్రి

'స్వేచ్ఛా గానం'

కవి పరిచయం:

జననం: 1897

తెలుగు భావకవులలో నిజమైన భావకవి దేవులపల్లి కృష్ణశాస్త్రి

గారే అని చెప్పాలి. వీరేశలింగం గారి నేతృత్వంలో మలుపుతిరిగిన తెలుగు సాహిత్యం ఆధునిక నైపథ్యంతో అనేక రూపాలు ధరించింది. అవధాన కవిత, అభ్యుదయ కవిత, భావ కవిత, వచన కవిత లాంటివి ఆధునికాంధ్ర సాహిత్యంలోని క్రొత్త ధోరణులూ, క్రొత్త పోకడలూ. భావకవితకు రూపసాధన చేసిన శిల్పులు రాయప్రోలు, వేదుల, అబ్బూరి, తల్లావజ్ఝల, నాయని మొదలైనవారు. మొదటచెప్పినట్లు దేవులపల్లి అచ్చమైన భావకవి. 1925లో ఆయన 'కృష్ణపక్షం' కావ్యాన్ని విడుదల చేశారు. బ్రహ్మసమాజం ఆదర్శాలతోను వంగసాహిత్య రీతుల పరిచయంతోను కలిగిన పరిణామం వల్లను పాశ్చాత్య సాహిత్య ధోరణులలో అనాడు ప్రచురంగా ఉన్న కాల్పనిక సాహిత్యోద్యమం వల్లనూ ప్రభావితుడైన కృష్ణశాస్త్రిగారు భావకవిత్వపథంలో పయనించటానికి ఉద్యుక్తులైనారు. తత్ఫలితంగా వెలసినవే కృష్ణపక్షము, ప్రవాసము, ఊర్వశి. ఇవన్నీ భావగీతాల సంపుటాలే. స్వచ్ఛంద ప్రియత్వం, భగ్నప్రేమ, నిర్వేదం, తాత్త్వికదృష్టి ఈరచనల్లో సర్వత్రా దర్శనమిస్తాయి. తెలుగునుడికారాల్ని సుకుమారమైన మెలకువలతో చమత్కారమైన విరుపులతో ప్రయోగించి, తనదంటూ ఒక శైలిని నిర్మించుకొని "కృష్ణశాస్త్రిది కవిత ఓకూనలమ్మా" అనే రీతిగ ప్రశంసింపబడినారు. భావకవులలో కృష్ణశాస్త్రిగారి చేతిలో ప్రాతపదాలే కొత్త పరిమళాన్నీ, కొత్త వన్నెలనూ సంతరించుకొన్నాయి. అంతేకాదు కృష్ణశాస్త్రిగారి పద్యరచనారీతి, పఠనరీతులు మాత్రమేకాక వారి 'గిరజాలు' 'కండువా' మొదలైనవి కూడా తరువాతి యువకవులకు అనుకరణీయాలైనవి. మహతి, ఋగ్వేది ధనుర్దాసు, తిరుప్పావై, రేడియో నాటికలు కృష్ణశాస్త్రి గారి యితర రచనలు.

పాఠ్య పరిచయం:

ప్రస్తుత పాఠ్యాంశమైన స్వేచ్ఛా గానము కృష్ణశాస్త్రీగారి కృష్ణపక్షమునుండి గ్రహింపబడింది. భావకవిత్వంలో పలురీతులుగా వెలసిన

ప్రణయ కవిత్వం, ప్రకృతి కవిత్వం, భక్తి కవిత్వం, దేశభక్తి కవిత్వం సంఘసంస్కరణ కవిత్వం, స్మృతి కవిత మొదలైన వాటికుదాహరణాలుగ కృష్ణపక్షంలో అనేక కవితాఖండికలు రచింపబడినాయి. ప్రస్తుత పాఠ్యం 'స్వేచ్ఛాగానము' లోని రెండు భాగాలలో మొదటిదానిలో స్వేచ్ఛ కోసం విరుతించటం, స్వేచ్ఛకోసం ప్రాణసుమాలర్పించిన వారి త్యాగ విరతినికొనియాడుతూ గానం చేయటం, భయనివృత్తికీ చీకటి తెరలను మరచిపోవటానికీ ప్రపంచంనిండా స్వేచ్ఛాగీతాల ప్రవాహాలను ప్రసరింప చేయాలని పూనుకొన్నట్లుగాను, రెండవ భాగంలో పక్షివిహారాలలో తేలుతూ తారకలతో పయనిస్తూ, పిదప చినుకులా నేలమీద పడిపోవాలని, చందమామతో దోబూచులాడాలని సముద్రగర్భంలో మునిగిపోవాలని, తెమ్మెరలతోబాటు విహరించాలని కుతూహలంగా ఉన్నట్లు, అలాగ ప్రకృతితో సహవాసం చేయటం, ప్రకృతితో తాదాత్మ్యం చెందటం లజ్జాకరం కాదని పైగా అలాంటి స్వేచ్ఛ ప్రాణులకుండాలని కవి ఉద్దేశం.

## శ్రీశ్రీ
(శ్రీరంగం శ్రీనివాసరావు)
'దేశచరిత్రలు'

**కవిపరిచయం:**

జననం: **1910, జనవరి 2**
నిర్యాణం: **1983, జూన్ 15**
జన్మస్థలం: **విజయనగరం**

సంప్రదాయం పాదులో జన్మించి బాల్యంనుండే కవితారచనకు శ్రీకారం చుట్టిన శ్రీశ్రీ "వీరసింహ విజయ సింహాలు", "పరిణయ రహస్యం" వంటి నవలలు వ్రాసి 1928లో భావకవిత్వ యుగప్రవేశం

బాటలో పయనిస్తూ 'ప్రభవ' అనే ఖండకావ్య సంపుటి సంతరించి ప్రకటించాడు.

1928 తరువాత పాశ్చాత్య సాహిత్య అధ్యయనంవల్లనూ ప్రపంచ వ్యాప్తంగా ఏర్పడ్డ ఫాసిస్టు వ్యతిరేక దృక్పథం కారణంగానూ రష్యా బొల్షివిక్ విప్లవం వల్లనూ ప్రభావితుడై భావ కవిత్వపంజరం నుండి విడివడి 1933 జూన్ 2 తారీఖున 'జయభేరి' మ్రోగిస్తూ అభ్యుదయ కవిత్వానికి శ్రీకారం చుట్టినాడు. పాశ్చాత్య దేశాల్లో కావ్య కళారంగాల్లో వచ్చిన కొత్త ధోరణులను-సర్రియలిజం-డాడాయిజం-చైతన్యస్రవంతి రచనా విధానం తెలుగులో ప్రయోగాత్మకంగా ప్రవేశపెట్టాడు. సాహిత్య ఆశయాలను ప్రబోధించటమేకాక ఆయుధంగా మారి ఆ ఆశయాలను సాధించటానికి ఉపయోగపడాలని కలంతో ఖడ్గాన్ని సృష్టించాడు శ్రీశ్రీ 1966లో. అదే ఖడ్గసృష్టి కావ్యం. 1970లో విరసం ఏర్పడ్డప్పటి నుండి దానితో తాను అవినాభావ సంబంధంకలిగి అనేక రచనలు చేసాడు. అందులో కవితలు 'మరోప్రస్థానం' పుస్తకంగా రూపుదిద్దుకున్నాయి వచన రచనలు శ్రీశ్రీ వ్యాసాలుగా పుస్తకరూపంలో వచ్చాయి. 1950 నుండి సినిమా రచయితగా తెలుగు మహాజనానికి మరింత సన్నిహితుడయ్యాడు. ఇవికాక లిమరిక్కులు - పదబంధ ప్రహేళికలు - ప్రాస క్రీడలు-సిరిసిరిమువ్వ పద్యాలు మొదలయిన అధిక్షేప చమత్కారాల సాహిత్య సాముగరడీ లెన్నో చేసాడు.

1960లో కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారంతోబాటు రెండు సార్లు సోవియట్‌లాండ్ పురస్కారాల్ని పొందటమేగాక రష్యా, చైనాలను ఇంగ్లాండును సందర్శించి అనేక కొత్త అనుభూతుల్ని సంగ్రహించుకొని తన కలంద్వారా యువతరాన్ని భావితరానికి బంగరుబాట వేయమని ప్రబోధించాడు.

పాఠ్య పరిచయం—పద వివరణ:

ప్రస్తుత పాఠ్యాంశం 'దేశ చరిత్రలు' మహాప్రస్థానంలోని తలమానికమైన గేయాల్లో ఒకటి 1938, ఏప్రిల్ 19న వ్రాయబడింది.

విరుద్ధశక్తులుండటం ప్రకృతి ధర్మం. ఆ శక్తులు పరస్పరం సంఘర్షించగా ఏర్పడిన ఫలితమే చరిత్ర. కాబట్టి మానవజాతి చరిత్ర సమస్తం వర్గ సంఘర్షణ ఫలితమే అనే భావాన్ని "పరస్పరం......... పుట్టెను" అనే పాదాలలో పొందుపరచాడు.

పరస్పరాహరణోద్యోగం-

ఒకరి సంపదనొకరు అపహరించుకోవటానికి చేసే ప్రయత్నం.

సమవాకారం-

దశవిధ రూపకాలలో ఇదొక రకం. ఇందులో మనుషులుండరు. ఎవరి ప్రయోజనం వారుగా చూచుకొనే దేవాసురపాత్రలు పది పన్నెండు తామే నాయకులమంటూ ప్రవర్తిస్తాయి. నరజాతి చరిత్ర అది మనుషుల చరిత్రగా లేదు. అది పిశాచాల సమవాకారంలాగా గందరగోళంగా ఉందని శ్రీశ్రీ అభిప్రాయం.

చెంఘిజ్ ఖాన్-

(క్రీ.శ. 1166-1227). ఇతని మొదటిపేరు తెమూజిన్. మంగోలియా రాజ్యాన్ని విస్తరించి ప్రపంచమంతా ఆక్రమించాలని ఆశించినవాడు. మంగోల్ భాషలో చెంఘిజ్ ఖాన్ అనగా సర్వ విజేత అయిన సార్వభౌముడని అర్థం. ఇతడు ఉత్తర చైనా, తురుష్కరాజ్యాలైన బొఖారాన్, సమర్ఖండ్‌లపైనను, రష్యాపైనను దండెత్తి ఆ ప్రాంతాల్ని ఆక్రమించుకొన్నాడు.

తామర్లేను-

(క్రీ.శ. 1336-1405) పేరొందిన ఒక మంగోలియన్ విజేత.
ఇతనికి తైమూర్ అని వ్యవహారః
వలె దిగ్విజేత కావలెనని సమస్త
పారసీక రాజ్యము నాక్రమించి కిపాక్ ప్రా
ఓడించినాడు. 1398లో తన మనుమడైన [illegible]

సింధునదిని దాటి భారతదేశంలో ప్రవేశించి ఢిల్లీ వరకు ఆక్ర మించుకొని రాజుగా ప్రకటించుకొన్నాడు.

నాదిర్షా-

ఇతడు పారసీక ప్రభువు. క్రీ.శ. 1736లో నాదిర్‌కులీ అనే నాయకుడు ఇరాన్ ప్రాంతం ఆక్రమించుకొన్న అఫ్ఘను సేనలను తరిమేసి నాదిర్షా అనే పేరుతో రాజ్యాధిపతియైనాడు. భారత దేశం మీద దండెత్తి ఢిల్లీని కొల్లగొట్టాడు.

గజనీ మహమూద్-

(క్రీ.శ. 998-1030). ఇతడు కూడా పేరొందిన అఫ్ఘన్ విజేత. పశ్చిమ ఇరాన్ మొదలుకొని సింధునది వరకు గల ప్రాంత మంతా ఇతని పేలుబడిలో ఉండేది. ఇతడు భారతదేశంపై దండెత్తి సోమనాథ దేవాలయం కొల్లగొట్టి అనేక ధనరాసుల్ని గజనీకి తరలించుకొని పోయినాడు.

సికందర్-

(The Persian for Alexander means Alexander the great — Dictionery of Islam)
అలెగ్జాండర్: (క్రీ.పూ. 356-326). ఇతడు గ్రీకు దేశం చక్రవర్తి. ప్రఖ్యాత తత్వ శాస్త్రవేత్త అరిస్టాటిల్‌కు శిష్యుడు. యూరప్‌లోని గ్రీస్ మిసడోనియా దేశాలను పాలించిన మహా వీరుడు. ప్రపంచమంతా జయించాలనే కోరికతో సిరియా, పర్షియా మధ్య ఆసియాలను జయించి, క్రీ.పూ. 327లో హిందూకుష్ పర్వతాలను దాటి భారతదేశంలో ప్రవేశించినాడు.

వైకింగులు-

ఉత్తర యూరప్‌కు చెందిన ఒక జాతి. ఇప్పటి స్వీడన్, నార్వే తదితర ఉత్తర దేశాల ప్రాంతంలో సముద్రయానం చేస్తూ వ్యాపా

రమూ, దొంగతనమూ, యుద్ధాలు చేసేవారు. పరాక్రమానికి పేరుపడ్డ జాతి.

శ్వేతహూణులు-

White Hunes. జర్మనీకి చెందిన ఆటవికజాతి. నాల్గవశతాబ్దంలో రోమను సామ్రాజ్యం మీద దాడిచేసి కూలద్రోసిన జాతులలో ఒకరు.

సిథియన్లు-

క్రీ.పూ. 546–545 ప్రాంతంలో పారసీక చక్రవర్తి డరయస్-I గ్రీకు ప్రాంతాలపై దాడి చేసినపుడు గ్రీసుదేశములోని ఒక రాష్ట్రానికి చెందిన ఈ సిథియన్లు దరయస్‌ను ప్రతిఘటించినవారు.

థగ్గులు-పిండారీలు-

మధ్య భారతంలో-బ్రిటిష్ రాజ్యాధికారం దేశంలో బలపడిన తరువాత వృత్తులు కోల్పోయి దొంగతనాలకూ, దోపిడీలకూ దిగి అవే వృత్తులుగా బ్రతికినవాళ్ళు. వాళ్ళను బ్రిటిష్ అధికారులు లొంగదీసుకున్నారు.

చెక్‌దేశం-

జకొస్లోవేకియా - (యూరప్ ఖండంలోని దేశం)

కళాసీ: నావలలో పనిచేసే శ్రామికుడు.

హాటెన్‌టాట్-

దక్షిణ ఆఫ్రికాలో నివసించే ఒక తెగ.

జూలూ-

2000 సంవత్సరాల కాలం ప్రపంచంలో అనేక ప్రాంతాలలో బదు కంటూ స్థిరమైన నివాసంలేక [illegible] ఒక జాతి 1948 ప్రాంతంలో ఇజ్రాయిల్‌ను నివాసంగా చేసుకొని స్థిరపడ్డారు.

పత్రములు, శైథీయతలు-

సమాచారాలు, రాజుల శాసనాలు, ప్రకటనలు... మొ॥

నైలునదీ నాగరికత:

హెరడోటస్ అనే గ్రీక్ చరిత్రకారుడు నైలునది ఈజిప్టుకు వర ప్రసాదమని వర్ణించినాడు. అక్కడి నాగరికత నైలు లోయలో వికసించింది. నైలునదీ పరివాహ ప్రాంతమంతా సమశీతోష్ణస్థితి కలిగిఉంది. ప్రజలు ఈశీతోష్ణ స్థితిలో బాగా శ్రమించగలిగేవారు. ఈజిప్టులో నాగరికత అభివృద్ధి చెందటానికి అక్కడి నైలునది, శీతోష్ణస్థితులు కారణాలు. అక్కడి నాగరికత క్రీ.పూ. 5000-1090 వరకు విస్తరించింది. ఖగోళమూ, గణిత శాస్త్రము, సూర్య సిద్ధాంతము, అంక గణితము, రేఖా గణితము, వైద్య శాస్త్రము, లిపి సాధనాలు, పిరమిడ్ల నిర్మాణం, కార్నక్, లక్సర్ వంటి దేవాలయాలు, ఫీనిక్స్ శిల్పము, నైలునదీ నాగరికతలో విల సిల్లిన శాస్త్ర విజ్ఞానానికీ, కళలకూ నిదర్శనాలు.

తక్షశిల-

ఇప్పుడు పాకిస్తాన్ భూభాగంలోఉన్న ఒక ప్రాచీన శిథిలనగరం. ఈ నగరం నేటి 'రావల్పిండి' పట్టణానికి 16 కి మీ. దూరంలో ఉంది. ఈ నగరం కేంద్రంగా తక్షశిల అనే రాజ్యం క్రీ.పూ. 300కు ముందే ఉండేది. ఈనగరం బౌద్ధమత కేంద్రంగా ప్రశస్తి పొందింది.

పాటలీపుత్రం-

క్రీ.పూ. 269 లో మౌర్య వంశీయుడైన అశోకుడు మగధ సామ్రాజ్యమునకు పట్టాభిషిక్తుడైనాడు. అతని సామ్రాజ్యానికి పాటలీపుత్రం (నేటిపాట్నా) రాజధానిగా ఉండేది. గుప్తరాజుల కాలంలోను అనగా క్రీ.శ. 320 నుండి అర్థశతాబ్దం వరకు కూడా ఈనగరమే రాజధాని.

మధ్యధరా సముద్రతీరం-

ఆఫ్రికా ఖండంలోని ఉత్తర ప్రాంతంలో ప్రవహించే ప్రముఖమైన నదీ ప్రాంతం.

హారప్ప-మొహెంజొదారో-

ఈ నగరములు క్రీ.పూ. 2000 సంవత్సరాల నాటి సింధు నాగరికతకు సంబంధించినవి. వీటికి ప్రాచీన కాలమున ఉన్న పేర్లు తెలియరావు.

క్రోమాన్యాన్ గుహాముఖాలు-

పరిణామక్రమంలో వానర దశను దాటిన మొట్టమొదటి మానవుణ్ణి క్రోమాన్యా అంటారు. అలాంటి మనుషులు నివసించిన గుహలుగా పురాతత్వ శాస్త్రజ్ఞులు ఆఫ్రికాలో కొన్నింటిని గుర్తించారు.

విభాతం - ఉదయం

ప్రస్థానం-

కదలిక - మహాప్రస్థానమంటే గొప్ప కదలిక అని అర్థం చెప్పుతున్నాడు శ్రీశ్రీ.

## కాళోజీ నారాయణరావు

### 'వ్యత్యాసాలు'

కవి పరిచయం :

జననం: 1914, సెప్టెంబర్ 9.

కాళోజీ నారాయణరావుగారు వరంగల్లు మండలంలోపుట్టి ఈశతాబ్దం రెండోపాదం నుండి తెలంగాణాలో సాంస్కృతిక చైతన్యం సాగించటా నికి కృషి చేసిన ప్రజానాయకుల్లో ప్రథమంగా పేర్కొనవలసినవారు.

కాళోజీవారి రాజకీయ జీవితం, కవితా వ్యవసాయం రెండూ ఏకధాటిగా సాగి తెలంగాణావైతాళికుల్లో ఆయనను అగ్రగామిని చేశాయి.

1934-1936 మధ్య హైదరాబాదులో న్యాయ శాస్త్రం చదివే రోజుల్లోనే 'వైతాళిక సమితిఅనే ఒక చిన్న సాహితీ సంస్థను నెలకొల్పారు. అలాంటిదే వరంగల్లులో వారి ఆధ్వర్యంలో కొనసాగిన మిత్ర మండలి' అనే సాహితీ సంస్థ కూడ. జాతీయోద్యమంలోను, తెలంగాణా విమోచ నోద్యమాలలోనూ క్రియాశీలంగా పాల్గొని రెండుసార్లు జైలు పాలైనారు.

1957-58లో తెలుగులో పారిభాషిక పద నిఘంటువు నిర్మాణానికి ప్రభుత్వం ఏర్పాటు చేసిన 'గ్లాజరీ కమిటీ' లోను శాసన మండలిలోనూ సభ్యులుగా ఉన్నారు.

శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామిగారి దేశోద్ధారక గ్రంథమాల కాళోజీగారి 'నాగొడవ'ను 1953లో ప్రచురించి ప్రకటించింది. అలంపురం సారస్వత సభల్లో శ్రీశ్రీ 'నాగొడవ'ను ఆవిష్కరిస్తూ కాళోజీని సుప్రసిద్ధ ఫ్రెంచి కవి అయిన 'లూయీ ఆరగాన్'తో పోల్చి అభినందించారు. అందుకే కాళోజీ 20వ శతాబ్దం ఉత్తరార్థంలో తెలంగాణాలోని మొదటి ప్రజాకవి. ఆయన రచనలకు సమాకాలిక ఆర్థిక రాజకీయ అసమానతలే ప్రధానమైన ప్రేరణ శక్తులు. వారి రచనల్లోకెల్ల సుప్రసిద్ధమైంది 'నాగొడవ' 1953లో ప్రచురింపబడిన కావ్యం. ఆ తరువాత ఆయన తన కవితలను 'నాగొడవ' పేరుతోనే మొత్తం ఏడు సంపుటాలుగా ప్రచు రించారు. హెచ్. ఎన్. బ్రెల్స్‌ఫోర్డ్ రచించిన 'రెబెల్ ఇండియా'ను 'నా భారత దేశ యాత్ర' అనే పేరుతోను, ఖలీల్ జిబ్రాన్ అరబ్బీ

భాషలో రచించిన 'Prophet' ను 'జీవన గీత' అనీ, ఎన్.సి. ఫడ్కే నవలను 'అంజలి' అనే పేరుతోను, సానే గురూజీ రచనను 'భారతీయ సంస్కృతి' అనే పేరుతోను తెలుగులోనికి అనువదించారు. కాళోజీ కథలు, తుది విజయం మనది నిజం, పార్థివ వ్యయం Sand & Foam, లంకానగరోద్ధరణం అనేవి వారి ఇతర రచనలు.

పాఠ్య పరిచయం :

ప్రస్తుత పాఠ్యాంశం 'వ్యత్యాసాలు' కాళోజీగారి 'నాగొడవ' కావ్యం నుండి గ్రహించబడింది.

దేశంలో ఆర్థిక అసమానతల వల్ల, తరతమ భేదాల వల్ల, ధనిక బీద విభేదాల వల్ల ఉత్పన్నమయ్యే సమస్యలకూ, సంఘటనలకూ స్పందిస్తూ ఎన్నో కవితలు వ్రాసారు కాళోజి. అవసరం ఉన్నచోట వస్తు ప్రాప్తి లేక పోవటానికీ, అనవసరమైన చోట వస్తు సంపద నిష్ప్రయోజనంగా పడి ఉండటానికీ గల వ్యత్యాసం ఎలా ఉంటుందో ఈగేయంలో రకారకాల నిదర్శనాలతో నిరూపించారు.

అన్నపురాసులు ఒక చోట - ఆకలి మంటలు ఒక చోట అనే ఎత్తుగడలోనే సమాజంలోని వాస్తవిక పరిస్థితిని పాఠకుల ముందుంచి, కావ్యపిపాసువు లొకచోట—కళా ప్రదర్శనమొక చోట అనే పాదాల్లో అనుభవించటానికి యోగ్యతగలవారికి కలిగే భంగపాటునూ, అయోగ్యులకు ప్రాప్తించే వస్తు సమృద్ధినీ గుర్తుచేస్తూ, హంసతూలికలొక చోట- అలసిన దేహాలొక చోట అనే పాదాల్లో సమాజంలో వ్యాపించిన కుబేర వైభవానికీ-కుచేల దారిద్ర్యానికీ గల వ్యత్యాసాన్ని విశదీకరిస్తూ ఈమిట్ట పల్లాలు సమసిపోయి సమత ఏర్పడటానికి జన చైతన్యాన్ని తట్టి లేపు తున్న గేయం ఈ 'వ్యత్యాసాలు'.

# దేవరకొండ బాలగంగాధర తిలక్

## 'ఆర్తగీతం'

కవి పరిచయం:

జననం 1921, నిర్యాణం 1966

జన్మస్థలం-తణుకు (గోదావరి జిల్లా)

ఆధునిక కవితా ప్రస్థానంలో పయనిస్తూ వచన కవితకు మెరుగులు దిద్దిన నవ్య కవులలో తిలక్ ఒకరు. అతి తక్కువ కాలంలో మంచి పేరు గడించి తెలుగు సాహిత్య చరిత్రలో చిరస్థాయిగా నిలిచే కవి స్థానం సంపాదించుకొన్నాడు.

భావకవుల ఒరవడిలో కవితారచన చేసినా సామాజిక స్థితిగతులనూ వాటిలోని వాస్తవికతనూ కళాత్మకంగా వర్ణించటమే సిద్ధాంతంగా చేసికొని కవితా వ్యవసాయం కొనసాగించాడు. అందుకే 'నవత-కవిత' అనే గేయంలో ఒకచోట 'అగ్నిచల్లినా అమృతం కురిపించినా అందం ఆనందం దాని పరమావధి' అని వర్ణించి తన కవితా లక్ష్యాన్ని విశదీకరించాడు. అందువల్లనే ఆయన కవిత్వం అభ్యుదయ కవిత్వం కొన్నిపాళ్ళూ భావ కవిత్వం కొన్నిపాళ్ళూ కలసిన మిశ్రమ రూపం అనే విమర్శకు గురైంది. అయినా అతను భావకవులకే దగ్గర అని కొందరు విమర్శకుల అభిప్రాయం. వ్యావహారికతతో బాటు సమాసప్రౌఢిమ భావోద్రేకం సమపాళ్ళలో మేళవించిన శైలి ఆయన కవితకు జీవనాడి. "ఆధునిక వచన కవిత్వానికి ప్రాణంపోసినవాడు తిలక్ 'అతని కవిత్వంలో కొట్టవచ్చినట్లు కన్పించే లక్షణం స్పష్టత. అదే అయన కవితకు నిజమైన అలంకారం' అని కుందుర్తి గారు తిలక్ కవితాతత్వాన్ని శ్లాఘించారు.

తిలక్ రచించిన 'అమృతంకురిసిన రాత్రి' అనే కవితా సంపుటి తొలిసారిగా 1968 జులైలో వెలువడింది. దీనికి 1969లో రాష్ట్ర సాహిత్య

ఎకాడమీ పక్షాన, 1970లో కేంద్ర సాహిత్య ఎకాడమీ పక్షాన పురస్కారాలు లభించాయి.

'గోరువంకలు' అనేది తిలక్ పద్యాల సంపుటి. 1941లో ప్రకటించిన 'ప్రభాతము-సంధ్య' ఆయన రచించిన తొలి వచన కవితా సంపుటి. సుశీల పెళ్ళి, సాలెగూడు సుప్తశిల అనే మూడు నాటకాలు, సుచిత్ర ప్రణయం ఇరుగు పొరుగు అనే రెండు నాటికలు కూడా రచించాడు.

కథకుడిగా కూడ ఆయనకు ఒక ప్రత్యేక స్థానముంది. తిలక్ కథలు అనే పేరుతో సుమారు 25 కథల సంపుటి ఒకటి ప్రకటింపబడింది. ఆయన అసంపూర్తిగా వదిలేసిన మరో రచన 'మంచు'.

పాఠ్య పరిచయం:

ప్రస్తుత పాఠ్యాంశం 'ఆర్తగీతం' అమృతం కురిసిన రాత్రి అనే కవితా సంపుటి నుండి తీసుకోబడింది. ఆర్తగీతం అంటే కష్టదశలో ఉన్నవాళ్ల లేక పీడిత జనాల ఆక్రందన అన్నమాట. కవిత్వంలో ఎంత సేపూ వస్తువు అలౌకిక విషయాల్నీ అతీతకాల చారిత్రకాంశాలనూ, జాతిగతవైభవాల్నీ నెమరువేస్తూ వ్రాయటమే కాదు. తన చుట్టూరా సమాజంలో దారిద్ర్య రేఖకు దిగువన ఉన్న పీడిత జనాలనూ చరిత్రహీనులనూ గుర్తించి వారి ఆర్తిని కవిత ద్వారా సమాజానికి వినిపించి వారిని ఉద్ధరించటానికి సమాజాన్ని ప్రబోధించటం సామాజిక స్పృహను కలిగించటం కవితాలక్ష్యంగా పెట్టుకున్న వాళ్ళు ప్రజాకవులుగా పరిగణింపబడతారు. అలాంటి వాళ్ళకోవకు చెందిన కవులలో తానూ ఒకడుగా ఆ విధమైన అనుభూతులను కవితల రూపంలో వెలువరించాడు తిలక్. భావుకుడు కాబట్టే ఎంత చిన్న ప్రేరణకలిగినా చలించిపోయే సుకుమార హృదయం కలవాడు. తిలక్ దుఃఖితుల పట్ల అపారమైన జాలి కరుణ కలిగి కరిగిపోతాడు. అందుకే ఈ గేయంలో ఆయన దేశాన్ని గురించి పాడలేనని గత చారిత్రకవైభవాల్ని వర్ణించలేనని విషాద స్మృతిలో

ఉన్నతాను పైన దేవునికీ క్రింద మానవుడికీ జవాబు చెప్పవలసిన వాణ్ణినీ తెలుపుతూ ఒకరోజు నగరంలో పలుతావుల్లో తాను చూచిన దరిద్ర నారాయణుల దైన్యాన్నీ హైన్యాన్నీ వర్ణించాడు. ఇలాంటి పరిస్థితి ఏ నాగరికతకు ఫలశ్రుతి అనీ వాపోయాడు. సమాజంలోని ఆర్తులంతా సార్థక జీవితులయ్యే వరకు తనకు శాంతి కలుగదని అంతవరకు సమాజా నికి తన సిగ్గులేని ముఖాన్ని చూపించలేనని విన్నవించుకొంటాడు. ఇక్కడ కవి నేను నేను అని చెప్పటాన్ని ప్రతి పాఠకుడూ తానుగా భావించుకోవాలి. అంతఃపురంలో భోగభాగ్యాల నడుమ ఎంతోకాలం గడిపి కాలాంతరంలో నగర సంచారం చేస్తూ ప్రజాజీవనం కళ్ళారా చూచిన గౌతముడు ఒకప్పుడు పొందిన హృదయ స్పందనా ఆవేదనా తిలక్ కూడా పొందినట్లు ఈ గీతంలో స్ఫురిస్తున్నది.

ముఖ్య పదార్థ వివరణ:

విపంచి - వీణ, దివాంధరుతి - గ్రుడ్లగూబ అఱపు

సురభిళాత్త - పరిమళంతోనిండిన

పరిరంభము - కౌగిలి, హేతి - కత్తి

నీరంధ్ర - దట్టమైన, వాతూలము - సుడిగాలి

నీపశాఖ - కడిమిచెట్టు కొమ్మ

నీరవ - నిశ్శబ్దమైన

## కుందుర్తి ఆంజనేయులు

### 'తప్పిపోయిన సత్యం'

కవి పరిచయం:

జననం: 1922, డిసంబర్ 16, నిర్యాణం: 1982, అక్టోబర్ 26

జన్మస్థలం: గుంటూరు జిల్లా-నరసారావుపేట తాలూకా

కోటవారి పాలెం

'నయాగరా' కవులుగా ప్రసిద్ధులైన అభ్యుదయ కవుల్లో కుందుర్తి ఒకడు. ఏల్చూరి, రామదాసులతో కలిసి మొదటి అభ్యుదయ కావ్యాన్ని 1944లోనే ప్రచురించిన ఘనత కుందుర్తిదే. అభ్యుదయ కవితామార్గ ప్రవర్తకుడైన శ్రీశ్రీ మహాప్రస్థానం కవితలు ప్రచారంలో ఉన్నా పుస్తకంగా ఆ తరువాత 5, 6 ఏళ్ళకుగాని రాలేదు. భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత తెలుగులో అభ్యుదయ కవిత్వం వెనుకబడిపోతున్న తరుణంలో కుందుర్తి కవిత్వం ఆకృతిలో కొంత మార్పును తెస్తూ దాన్ని వచన కవిత్వం పేర క్రమంగా ఒక ఉద్యమంగా పెంచినాడు. ఆకృతితోబాటు అంతస్సులోనూ ఆమేరకు మార్పురాక తప్పదు. అందువల్ల ఆధునిక సమాజ కవులలో కుందుర్తి అగ్రస్థానీయుడైనాడు. ఈ వర్తమానపు రాజకీయ, ఆర్థిక వ్యవస్థలో సామాజిక జీవితం స్థితిగతులను ఎక్స్‌రే కళ్ళతోచూచి వ్యంగ్యంగా, వెటకారంగా, జాలిగా బరువుగా ప్రజలకు తేలికగా తెలిసేటట్లుగా చెప్పటమే కుందుర్తి తన వచన కవిత్వానికి లక్ష్యంగా చేసుకొన్నాడు.

నిజాం భూస్వామ్య రాచరికానికి వ్యతిరేకంగా 1949 దాకా సాగిన తెలంగాణా సాయుధ విముక్తి పోరాటాన్ని వస్తువుగా చేసి కుందుర్తి 'తెలంగాణా' కావ్యాన్ని రచించినాడు. ఇంకా ప్రసిద్ధమైన ఆయన ఇతర కృతులు యుగే యుగే, దండియాత్ర, మాతృసందేశం, నగరంలో వాన, మొదలయిన కావ్యాలూ, ఆచార్ల గారమ్మాయి, శిక్షయేమిటి, ఆశ అనే వచనగేయ నాటికలూ మొదలయినవి.

పాఠ్య పరిచయం:

ప్రస్తుత పాఠ్యాంశం 'తప్పిపోయిన సత్యం' కుందుర్తి రచించిన వచన కవితా సంపుటి 'మాతృ సందేశం' నుండి గ్రహింపబడింది.

గాంధీజీ మనదేశానికి బ్రిటిష్ సామ్రాజ్యం నుండి స్వాతంత్ర్యం సంపాదించి పెట్టారు. సత్యమూ, అహింస అనే రెండు ఆదర్శాలను

ఆయన ఆచరణయోగ్యాలైన సాధనాలుగా చేసుకొని సూర్యుడస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యాధికారాన్ని ఎదుర్కొని తన లక్ష్యాన్ని సాధించినాడు. ఆయన సిద్ధంచేసిన స్వతంత్ర భారతదేశానికి ఆయన వారసులుగా ఏలిన నాయకులు ఆయన ఆదర్శాలను ఆచరణలో దూరంగాపెట్టి ఆయన పేరు చెప్పుకొంటూ కాలక్షేపం చేస్తున్న జీవిత విధానాన్ని నిరసించటమే ఈ కవితలోని లక్ష్యం. లక్ష్యాన్ని కొంత వాచ్యంగా, కొంత వ్యంగంగా మరికొంత తిరస్కృత వాచ్యంగా చెప్పటం ద్వారా కవిత్వంగా చేయ గలిగినాడు. వస్తువును కవిత్వంగా రూపొందించగల వచన రచనా చమత్కారాన్ని తనదిగా చేసుకొన్న సామాజిక చైతన్య భావుకుడు కుందుర్తి.

విశ్వనాథ శిష్యరికంనుండి తాను జీర్ణించుకొన్న సంప్రదాయ విజ్ఞానాన్ని శ్రీశ్రీ అభ్యుదయ ఆలోచనాధోరణికి అనుయాయి కావటం వలన ప్రయోజనవంతంగా తన కవిత్వంలో ఉపయోగించుకొన గలిగాడు కుందుర్తి.

## దాశరథి కృష్ణమాచార్య

'మంజీర'

కవి పరిచయం:

జననం: సెప్టెంబర్ 1927

జన్మస్థలం: ఖమ్మం జిల్లా-మానుకోట తాలూకాలోని గూడూరు.

చిన్నతనం నుండే పద్యాలల్లటం ప్రారంభించిన దాశరథి అతి తక్కువ కాలంలోనే కవిత్వ రచనలో ప్రౌఢత్వం సంపాదించి తెలంగాణాలోని సాహిత్య చైతన్యాన్ని ప్రతిబింబించిన తెలుగు పద్యానికి కొత్త ఒరవళ్ళు దిద్దిన మనీషి.

భారత స్వాతంత్ర్య సమరం జరుగుతున్న కాలంలోనే తెలంగాణాలో నిజాం ప్రభుత్వ వ్యతిరేకంగా ఉద్యమం బయలుదేరింది. జాతీయోద్యమం ప్రభావంతో ఆంధ్ర రాష్ట్రంలో ఆంధ్ర ప్రశస్తిని, ఆంధ్రతేజాన్ని ప్రబోధించే కవిత్వం ఎంతో వెలువడినా తెలంగాణావారి అగచాట్లను చిత్రించిన తక్కువ మంది కవుల్లో దాశరథిగారే అగ్రేసరులని చెప్పక తప్పదు. తెలంగాణా స్వాతంత్ర్యోద్యమ కవితకు మూలస్తంభం ఆయన.

దాశరథి మొదటి కవితా సంపుటి అగ్నిధార తెలంగాణా విముక్తి పోరాటం కోసం పరితపించిన తెలుగు వాళ్ళ ఆక్రందనలను వినిపించిన ఒక కాహళా.

సామ్యవాదం, శాంతిమార్గం అనే రెంటిని సమన్వయించి గాంధీ, నెహ్రూలు అభిలషించిన సత్యాగ్రహపు విప్లవాన్ని మాత్రమే సమర్థించి అభ్యుదయ పంథాలో కవితా వ్యవసాయం సాగించారు. తెలంగాణా రచయితల సంఘానికి రూపకల్పన చేసిన ప్రధాన శిల్పి దాశరథి. 1952లో ఈ సంఘాన్ని స్థాపించి రెండుసార్లు అధ్యక్షులుగా ఉన్నారు. దాశరథి రచించిన మహాంధ్రోదయం విశాలాంధ్ర భావనను సమర్థిస్తూ స్వాగతించిన కవితానీరాజనం. వేర్పాటు ఉద్యమాలు ఆరిపోయి సమైక్యభావం ప్రబలటం కోసం ఆయన మహాంధ్రోదయం రచించి గానం చేసారు. ఆయన రచించిన తిమిరంతో సమరం కావ్యానికి కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం లభించింది. కవిసామ్రాట్ విశ్వనాథవారి తరువాతనుండి మొన్నటిదాక ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆస్థాన కవిగా ఉన్నారు. మహాబోధి, ఋతుషట్కం, కవితా పుష్పకం, దాశరథీ శతకం మొదలగునవి ఆయన ఇతర రచనలు. సినీగీతాలలో వీణపాటలకు ఆయనపెట్టింది పేరు.

పాఠ్య పరిచయం:

ప్రస్తుత పాఠ్యం 'మంజీర' దాశరథి గారి మహాంధ్రోదయం అనే ఖండ కావ్యం నుండి గ్రహించబడింది. మంజీరఅనే నది ఆంధ్రదేశంలో

ప్రవహిస్తున్న గోదావరి నదిలో కలిసే ఉపనదులలో ఒకటి. ఈ నది మహారాష్ట్రలోని బాలఘాట్ పర్వతాలలో పుట్టి ఆగ్నేయ దిశగా ఉన్న మహారాష్ట్రలోని ఉస్మానాబాద్ మండలం గుండా ప్రవహించి మెదక్ జిల్లా గుండా ఆంధ్రప్రదేశ్‌లో అడుగిడింది. తిరిగి ఆగ్నేయ దిశగా ప్రవహిస్తూ నిజామాబాద్‌లో కొంతదూరం ప్రవహించి గోదావరిలో కలుస్తుంది. నిజామాబాద్‌లోని ఎల్లారెడ్డి తాలూకాలో మంజీరా నదిపై నిజాం సాగర్ అనే ప్రాజెక్టు నిర్మించబడింది. ఈఆనకట్ట అంతవరకు తెలంగాణాలో నిస్సారంగా ఉన్న భూములనెన్నిటిన్నో సస్యశ్యామలం చేయటానికి తోడ్పడింది. మంజీర చల్లని చూపుతో తెలంగాణ సుసంపన్నం అయింది. తన మాతృభూమిని సస్యశ్యామలం చేసిన మంజీర పట్ల కృతజ్ఞ భావంతో నిండిన దాశరథి హృదయం ఈ కవితను వెలువరించింది. తన దేశానికి, తన జనులకు ఆకలి తీర్చటానికి అరుదెంచిన మంజీరను ఆయన ప్రశంసించిన విధం ఈ ఖండిక వ్యక్తం చేస్తుంది.

ముఖ్య పదార్థ వివరణ:

మంజీరము - కాలి యందె

కజ్జల బాష్పము - కాటుకతో కూడిన కన్నీరు

ఇక్షుదండము - చెరుకు గడ

చైత్ర రథము - కుబేరుని ఉద్యానవనం

కావ్యదుకూలము - కావ్యమనే వస్త్రము

యజనము - యజ్ఞము

వాక - వాగు

భగీరథుడు - సగర చక్రవర్తి మనుమడు. ఇతడు శివుని ప్రార్థించి ఆకాశగంగను భరతభూమికి కొనివచ్చి ప్రవహింప జేసినాడు.

అంతికము - సమీపము

తీవమాద్రి - తీగలాగ

ఏడుపాయలదుర్గ — మంజీర ఏడుపాయలుగా చీలినచోట దుర్గా దేవి గుడి ఉన్నది.

లలంతిక - కంఠహారము

హసంతిక - కుంపటి

సేమంతిక - చేమంతులు

వాసంతిక - వసంతర్తువు సంబంధమయినది

అమృతపిచ్ఛిలము - అమృతముతో నిండారినది

మిసిమింతురాలు - అలసిపోయినది

